స్వదేశీ సంస్థానాలు - గాంధిజీ

Regd. No. M. 3824

# నవశక్తి

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వారపత్రిక

సంపుటం 2 } బుధవారం 29—3—39 బెజవాడ { సంచిక 15

పూర్ణచంద్ర జోషి                జయప్రకాశ్



త్రిపురిలో ఒక గొప్ప విషయము. సోషలిస్టు కమ్యూనిస్టులు కలిసి పనిచేయడము.

# నవశక్తి

## ఏజెంట్లు గమనించాలి

1. అమ్మిన ప్రతి కాపీకి 25% కమిషను ఇవ్వబడును.
2. ఏజెంట్లుకు పంపిన కాపీగలో 10% (నూటికి పది) కన్న ఎక్కువ కాపీలు తిరిగ తీసుకోబడవు.
3. ప్రతి నెల బిల్లులు, మరుచటి నెల 15 వ తారీఖు లోపల చెల్లించవలయును.
   ఉదా:—మార్చి నెల బిల్లు ఏప్రిల్ 15 వ తారీఖులోపల చెల్లించవలయును.
4. అట్లు చెల్లించని వారికి పత్రిక ఆ పైన పంపబడదు.
5. ఏ ఏజెంటుకైనను 10 కాపీలకు తక్కువ పంపించబడవు.

—మేనేజరు.

* * *

## చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 3-0-0 |
| అర్థ సంవత్సర చందా | 1-10-0 |
| విడిప్రతి | 0-1-0 |

బర్మా రేట్లు

| | |
|---|---|
| సంవత్సర చందా | రు 5-0-0 |
| విడి ప్రతి | 0-1-6 |

## ప్రకటన రేట్లు

"కాలం" వెడల్పు 2" (2 అంగుళాలు)

| | |
|---|---|
| 20 అం॥ లోపల ప్రతి అంగుళానికి | రూ. 0-6-0 |
| 20" అం॥ పైన ,, | 0-4-0 |
| 100" అం॥ పైన ,, | 0-3-0 |
| పేజీ | రు 10-0-0 లు |
| ½ పేజీ | 6-0-0 లు |
| ¼ పేజీ | 3-0-0 లు |

షరా:—ఈ రేట్లుపైన కమిషన్‌లు, డిస్కౌంటులు ఇవ్వబడవు. రు 0-8-0 లకు తక్కువ ప్రకటనలు తీసుకొనబడవు. నెలకగు డబ్బు ముందుగా ఇవ్వవలెను.

ప్రత్యేక చోటునకు, ప్రత్యేక రేట్లు.

* * *

| | మార్చి నెల కోటా | మూడు వారాలలో చేర్పించినది. |
|---|---|---|
| విశాఖపట్టణం | 5 | 2 |
| తూ. గోదావరి | 30 | 6 |
| ప. గోదావరి | 50 | 13 |
| కృష్ణా జిల్లా | 50 | 27 |
| గుంటూరు | 30 | 15 |
| నెల్లూరు | 20 | 9 |
| రాయలసీమ | 10 | 6 |
| ఇతర స్థలాలు | 5 | 7 |
| | 210 | 85 |

### పరదేశాలలో మా ఏజెంట్లు

జి. కాళిదాసు, 209 ఫేయర్ స్ట్రీట్, రంగూన్.

పర్కర్సు బుక్ షాప్, 14 కింగ్సు స్ట్రీట్, లండన్. W. C. 2.

లీగ్ అఫ్ ఇండియాస్ ఫ్రెండ్స్, 112 ఈస్ట్ 19 వ స్ట్రీట్, న్యూయార్కు సిటీ.







## వినుకొండ యూనియన్ బోర్డు తగాదాలు

అధికారుల అర్థములేని జవాబులు.

వినుకొండ గ్రామములో 5000 మంది హిందువులు, 5000 మంది మహమ్మదీయులు ఉన్నారు. మహమ్మదీయులకు ఏమి ఆస్తులు లేవు చాలామంది కష్టించి కాలము గడుపుచూ యున్నారు. హిందూ మహమ్మదీయ తగాదాలు చాలాకాలము లేవు. 1332 లో కొంతమంది స్థానిక అధికారులు మత కలహములు రేకొట్టినారు తరువాత ఆ అధికారులు మారిపోగానే పోరాటములుకూడా అగినవి.

యీగ్రామము తాలూకాకు ముఖ్యపట్టణము. యూనియన్ ఎన్నికలు 1938 నవంబరు నెలలో జరిగినవి. ఓటరులలిస్టులో 600 మహమ్మదీయ ఓటరులకు 31 ఓట్లే యున్నవి. మిగిలిన ఓట్లు ఎందుకు చేరలేదో ఎచ్చటనుంచి సమాధానము రాదు. పాత ఓటర్లలిస్టులలోఉన్న పేర్లుకూడా కానరాలేదు. వెంటనే 600 మంది మహమ్మదీయులు సంతకములుచేసి మంత్రిగారు మొదలు కలెక్టరుగారి వరకు అందరకు అర్జీలు పెట్టినారు.

ఎలక్షనులముందే గ్రామములో ఉండు కాంగ్రెసు సంఘ ప్రెసిడెంటు, కొంతమంది మహమ్మదీయ నాయకులు స్వపరిపాలనా శాఖామంత్రిగారి వద్దకువెళ్ళి జరిగిన అన్యాయమును చెప్పినారు. వారు వీరిని రివిన్యూ శాఖవారితో మాట్లాడవలసినదని జవాబు చెప్పినారు. జిల్లా కలెక్టరుగారు వినుకొండ మకాముకు వచ్చినపుడు 1000 మంది మహమ్మదీయులు కాంగ్రెసు సంఘ అధ్వర్యమున జిల్లాకలెక్టరుగారివద్దకు వెళ్ళినారు. వారు తమకు సంబంధంలేదు, లోకల్‌బోర్డువారినే అడుగవలసినదని జాబాబుయిచ్చినారు. మరల మంత్రిగారివద్దకు ప్రయాణము కట్టిరి. మంత్రిగారు చెన్నపట్నములో లేరు. లోకల్‌బోర్డుల యిన్సపెక్టరుగారిని కలుసుకొనిరి. ఇన్సపెక్టరుగారు తమ గుంటూరుజిల్లా సంచారములో కలుసుకొనమనిరి. వారు వినుకొండవచ్చిరి. వినుకొండలో మహమ్మదీయ ఓటరులందరు ఇన్సపెక్టరుగారిని కలుసుకొనిరి. వారు తమకు సంబంధములేదని రివిన్యూబోర్డువారికి అర్జీపెట్టుకొనమని సలహాయిచ్చిరి. వారి సలహాప్రకారం రివిన్యూ బోర్డువారికి ఒకమహాజరు పంపిరి. దానికి యింకను జవాబురాలేదు. నెల్లూరుజిల్లా సంచారము చేయుచు వినుకొండతాలూకా సరిహద్దులకు గోపాలరెడ్డిగారు వచ్చిరి. అప్పుడు మరల వీరంతా మంత్రిగారిని కలసిరి. మంత్రిగారు 'ఎలెక్షనులు అయిపోయినవి. చేసేదేమీలేదు' అని జవాబు యిచ్చిరి.

చాలామంది మహమ్మదీయులు పన్నులు కట్టుటలేదు వారు తమకు ఓట్లు లేనపుడు యూనియనుతో పనిలేపని యూనియనుతో పని లేనప్పుడు పన్నులు కట్టవలసిన అవసరములేదని వాదించుచున్నారు. ప్రభుత్వం మార్చి 10లోపల తేల్చకపోయిన యూనియనుకు పన్నులు ఇవ్వవద్దని, తీర్మానము చేసుకుని అట్లాగే ఒక మహజరు తయారు చేసినారు.

పదవిలో ఉన్నవారు మహమ్మదీయులను కూలీకి పిలువగూడదని గ్రామములో రహస్యముగా సభలు జరుపుచున్నారు. యిదియే ఫలించిన పోరాటము మత సంబంధముగా మారుటకు ఎక్కువ అవకాశమున్నవి.

కాంగ్రెసు మంత్రులు, అధికారులు వెంటనే వారి కోర్కెలు నెరవేర్చినచో పోరాటంలేకుండా చేసినవారగుదురు. ప్రజలకు మేలుచేసిన వారగుదురు.

శ్రీ గిరిరాజు సత్యనారాయణ,
కాంగ్రెసు సోషలిస్టు పార్టీ.

---


సంపుటం 2 — సంచిక 15

# నవశక్తి

బుధవారం — 29-3-39

సంపాదకవర్గం: మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు), కంభంపాటి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య, తుమ్మల వెంకట రామయ్య.


## గాంధీజీ — సంస్థాన ప్రజాపోరాటం.

రెండవ రౌండుటేబిలు సమావేశం ఎంత అసంతృప్తికరంగావున్నా, గాంధీజీ రామ్సే మాక్డనాల్డ్‌ను కౌగలించుకొని బ్రిటన్‌తో సహకారం చేస్తాననియే చెప్పాడు. కాని భారతదేశంలో గాంధిజీ అడుగిడునప్పటికే సరిహద్దు సంయుక్త రాష్ట్రాలలో ప్రభుత్వం తీవ్ర నిర్బంధవిధానం కొనసాగించడం, కాంగ్రెసు సంఘాలను అక్రమ సంఘాలుగా ప్రకటించడం, నెహ్రూ, గఫూర్ ఖాన్‌గార్ల అరెస్టులు, గాంధిజీకి వైస్రాయి ఇంటర్వ్యూసైతం యివ్వ నిరాకరించడం, గాంధిజీ తప్పనిసరిగా పోరాటాన్ని ప్రారంభించవలసి వచ్చింది. రాజీకాలంలో పదునుపరచిన నిర్బంధ విధానపుశక్తి శాసనోల్లంఘనాన్ని అణచివేయ గలిగింది. గాంధిజీ, సమష్టి వ్యక్తిగత సత్యాగ్రహములను క్రమంగా ఆపివేసి 1934 జూన్‌నెలలో తానొకడే సత్యాగ్రహంచేయుట కర్హుడనన్నాడు. ఈసందర్భంలోనే సత్యాగ్రహ సమరంలో జరిగిన పోలీసు నిర్బంధ విధానమును గురించిచెబుతూ "ఈపోలీసు నిరంకుశత్వానికి వ్యతిరేకంగా తాను ప్రాయోపవేశంచేసి ఆహుతి కావలసిన రోజు ఆసన్నం కాగలదు" అన్నాడు.

1937 అక్టోబరులో కలకత్తాలో సమావేశమయిన అఖిలభారత కాంగ్రెసు కమిటీ మైసూరు సంస్థానాధీశుని నిర్బంధ విధానాన్ని నిరశించి, ప్రజాపోరాటానికి సానుభూతి సహకారాలను తెల్పింది. గాంధిజీ ఉగ్రుడై కాంగ్రెస్‌కమిటీ తన పరిమితులనుదాటి సంస్థానాల విషయంలో జోక్యం కలిగించుకుందని ఆక్షేపించాడు. తత్ఫలితమే తటస్థవిధానం బోధించు హరిపురా కాంగ్రెస్ సంస్థానాల తీర్మానం.

కాని సంస్థాన ప్రజాఉద్యమ వెల్లువ మహాత్ముని కోర్కెలను, తటస్థవిధానమును నిర్లక్ష్యం చేసి విజృంభించింది. భారత దేశమందంతటా మారుమూలలనున్న సంస్థానాలలోకూడ, పౌరసత్వ హక్కులకొరకు, బాధ్యతాయుత ప్రభుత్వంకొరకు ప్రజాపోరాటం సాగింది. బ్రిటిషు ప్రభుత్వం యుద్ధసమయంలో ఆఖరి సంరక్షక సాధనంగా మిగుల్చుకొన్న సంస్థానాధీశుల రక్షణ కొరకు బ్రిటిషు సైనిక పటాలాలను సాయమంపింది. ప్రజాఉద్యమాల నణచుటకు నరేంద్రులకు సలహాలిచ్చింది.

ఎట్టకేలకు సంస్థాన ప్రజాపోరాటాన్ని స్వాతంత్ర్య పోరాటంలో ఒకభాగంగా తటస్థ విధాన నిర్మాతలగు గాంధీజీ పటేలులే అంగీకరించవలసివచ్చింది. ఈ మార్పుకు సోషలిస్టులం సంతోషించాం. గాంధీజీ నాయకత్వం వహించి సంస్థాన ప్రజాపోరాటం నడుపుతాడని దేశీయులు ఉవ్విళ్లూరార్లు.

కాని గాంధీజీ, విజృంభించుతున్న ఉద్యమానికి నాయకత్వం వహించి నడుపుటకు మారు అరికట్టాడు. హైదరాబాద్ ఉద్యమం ఆపివేయబడి ఆర్యన్‌లీగ్‌వంటి మతావేశపరుల స్వాధీనమైపోయింది. డెంకనాల్, తిరువాన్కూరు సత్యాగ్రహాలు ఆపుచేయబడినయి. రాజకోట సత్యాగ్రహం ఆపుజేసి, ఠాకూర్ సాహెబ్‌తో రాజీకివెళ్ళి, రాయబారాలు విఫలమై ఉపవాస దీక్ష బూనాడు. రాజ ప్రతినిధి సలహాపై ఫెడరల్ జడ్జీ తీర్పుకు సమస్యను వదిలాడు. అంటే ప్రజాపోరాటం ఆపి ఆ బాధ్యత తన ఒక్కనిపై నిడుకొని, గాంధీజీ ఆఖరుకు ఠాకూర్‌సాహెబ్‌తో పడేబడిన రాజీ షరతుల అర్థం చెప్పుటకు సామ్రాజ్య ప్రభుత్వ ఉద్యోగి ఫెడరల్ జడ్జీ చేతుల్లో పెట్టాడు.

ఇంతేగాదు, 23 వ తేదీ గాంధీజీ చేసిన ప్రకటనలో తిరువాన్కూరు, జైపూరు మరి యితర సంస్థానపోరాటాలన్నిటిని ఆపుజేసాడు. పైగా ఉద్యమం ఆపుచేసినచో ప్రజలలో నిరుత్సాహం, నిస్పృహ ప్రబలుతుందను తిరువాన్కూరు స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షుని వాదనను త్రోసివేస్తూ యిలా అన్నాడు. "సత్యాగ్రహంలో నిరుత్సాహం, హృదయావేదనకు అవకాశమే లేదు. పోరాటం ఏదో విధంగా గమ్యస్థానం చేరువరకు సాగుతూనే వుంటుంది. సత్యాగ్రహి, శాసనోల్లంఘనం మధ్యలో ఆపి, ఇంకోపని జేయమంటే కించపడకూడదు. అన్నీ మంచికొరకే అను నమ్మకమతని కుండాలి. పోరాటం ఆపినపుడల్లా ప్రజలు యింకా ఎక్కువ తయారవడం దౌర్జన్య శక్తుల స్వాధీనం చేసికోడం సాధ్యమన్నినా అనుభవం చెబుతూంది."

ఈ మాటలు చరిత్రనుండి అనుభవం గడించినవారు అనవలసిన మాటలుగావు. 1921 లో ఎచటనో దౌర్జన్యాలు జరిగాయని సంపూర్ణ హిందూ మహమ్మదీయుల ఐక్యతతో సాగింపబడుతున్న పోరాటాన్ని ఆపివేయుట, తీవ్రమైన నష్టాన్ని కలుగజేసింది. మరల దేశ వ్యాపక ఉద్యమం వచ్చుటకు పదియేండ్లు పట్టింది. నాడు చేకూరినట్టి హిందూ మహమ్మదీయ ఐక్యత నేటికిని సమకూరపేలేదు. 1931 లో గాంధీ ఇర్విన్ నామక సంధి కోసం ఆపుచేయబడిన సత్యాగ్రహోద్యమం మరల అట్టి స్థాయికి రాలేకపోయింది. సత్యాగ్రహికి ఎల్లప్పుడూ సిద్ధంగా వుండాలని వేదాంతం చెప్పవచ్చు కాని స్వాతంత్ర్యం, ప్రజాభీష్టం, ప్రత్యేక మానసిక తత్వము గల సత్యాగ్రహులచేతనే సాధింపబడదు. ప్రజా సామాన్యమంతా తీవ్రంగా స్వాతంత్ర్య సమరంలో పాల్గొనినపుడే జయం సాధ్యమవుతుంది. పోరాటానికి సదవకాశాలు మనము కోరినపుడు రావు. అట్టి అవకాశాలు వచ్చినపుడు వినియోగించడానికి తగిన నిర్మాణాన్ని ఏర్పాటు చేయుట విప్లవకారులపని. సత్యాగ్రహులపని. ప్రజలు పోరాటానికి సిద్ధంగా వున్నప్పుడు ఉద్యమాన్ని ఆపుట, ఆ అవకాశాన్ని గోల్పోయి పోరాటాన్ని సంకుచిత పరచుటయే. గాంధీజీ భౌతిక పరిస్థితులను గమనించడు. 'అంతరాత్మ' చెప్పినదని సవ్యంగా నడచే పోరాటాన్ని ఆపుచేసి, శత్రువుకు ఉద్యమాన్ని ఎదుర్కొనే అవకాశమిస్తాడు.

ఇంకా మహాత్ముడు, "వివిధ సంస్థానాలలో జరిగిన అమానుష కృత్యాలు గమనించి నేను శాసనోల్లంఘనానికి నూతన స్వరూపం యివ్వడానికి ఆలోచిస్తున్నాను" అన్నాడు.

గాంధిజీ యీనెల 27 తేదీ తిరువాన్కూరుపై యిచ్చిన స్టేటుమెంటులో అరెస్టులు యింకా జరిగినా విచారపడ నక్కరలేదనియు అవి ఉద్యమానికి సాయపడతాయనియు చెబుతూ, "శాసనోల్లంఘనం ఆపుచేయబడింది. గాన అరెస్టుఅయిన అధ్యక్షునిస్థానే మరల అధ్యక్షుని నియమించ నక్కరలేదు. ఈక్రొత్త ఎత్తు ఇతరులకు అర్థముగాదు. అయినా అనుభవమున్న సత్యాగ్రహిని నేను చెప్పుతున్నాను అవలంబించ వలసినదిగా" కోరాడు. ఈ క్రొత్త ఎత్తు మాకొకే విధంగా కనపడుతూ ఉంది. పోరాటాలను ఆపుజేయడమేగాక ముందుముందు పోరాటాలను తేవడానికి కావలసిన సంఘాలనుకూడ లేకుండా చేయడమే అవుతుంది. ఎందుకంటే, అధ్యక్షుని అరెస్టుచేస్తే వేరే అధ్యక్షుని నియమించ నవసరములేదను సూత్రాన్ననుసరించి, కార్యనిర్వాహక సంఘాన్ని అరెస్టుచేస్తే క్రొత్త కార్యనిర్వాహక సంఘాన్ని ఏర్పరచకూడదని కూడ తేలుతుంది. కార్యనిర్వాహకవర్గము, అధ్యక్షుడు (పనిని నడుపు వ్యక్తి) లేక, సభ్యులు తమంతటనే తాము పనిచేయాలని అదియే సత్యాగ్రహియొక్క లక్షణమని గాంధిజీ ఉద్దేశము కావచ్చు. కాని అది మాఅభిప్రాయంలో సంఘాలు లేకుండజేసి పోరాటాలను విచ్ఛిన్నము జేయడానికే తోడ్పడుతుంది.

ఇంతేగాక గాంధీజీ న్యూయార్కు పత్రికా విలేఖరి భారతదేశం స్వతంత్ర్య దేశముగా బ్రిటిషు సామ్రాజ్యంలో ఉంటుందా లేక బయటనా అను ప్రశ్నకు జవాబు చెబుతూ, "అది కష్టమైన సంగతి. ఆ విషయమై నేనింకా నిర్ణయించుకోలేదు" అన్నాడు. ఎంత హృదయవిదారకమయిన సంగతి. కాంగ్రెసు మహాసభ పదే పదే సంపూర్ణ స్వాతంత్ర్యమని తీర్మానించింది. ప్రతి భారతీయుడు బ్రిటిష్ సామ్రాజ్యంతో సంబంధంలేని స్వరాజ్యం కోరుతున్నాడు. ఐనా గాంధిజీ యింకా బ్రిటిష్ కామన్ వెల్తులోనో బయటనో భారతదేశం వుండేది నిర్ణయించుకోలేదు! ఈ పరిస్థితులలో కాంగ్రెసు తీవ్రమయిన తీర్మానం చేసిందని సంతోషిద్దామా? నాయకుడుగా నిర్ణయింపబడిన మహాత్ముడు స్వాతంత్ర్యానికి, సత్యాగ్రహానికి చెప్పే అర్థాలు కాంగ్రెసును వెనుకకు తీసుకొనిపోవుచున్నదని విచారిద్దామా?

మహాత్ముడు, "వైస్రాయి నరేంద్రులకిచ్చిన సలహా పనిచేయడానికి అవకాశమిద్దామం"టున్నాడు. పైగా "సామ్రాజ్య ప్రభుత్వం భారతీయుల యిష్టంపైనే ఆధారపడి జీవించుతూంది" అన్నాడు. అంటే గాంధీజీ వైస్రాయి సంస్థానాలలో ఏవో సంస్కరణలు యిప్పించుతాడని ఆశించుతున్నట్లు అర్థం చేసుకోవలసివస్తూంది. మనం సంస్థాన ప్రజాపోరాటం భారత స్వాతంత్ర్య పోరాటంగా బ్రిటిషుసామ్రాజ్యానికి వ్యతిరేక పోరాటంగా ప్రారంభించాం. నేడు సామ్రాజ్యవాదుల సలహాపై సంస్థానాలలో సంస్కరణలు వస్తాయని ఆశించే స్థితికి దిగజారాము. Oh! what a fall my countrymen! అయ్యో! ఎంతటి పతనం!

అయినా నిరుత్సాహపడ నవసరములేదు. హరిపురా తటస్థ తీర్మానము బుట్టదాఖలు చేయించగలిగాము స్వదేశ సంస్థాన ప్రజాపోరాటాన్ని పెంపొందించి. అటులనే గాంధిజీ యొక్క ఈ నూతన దృక్పథాన్ని మార్చివేయుట కొక పద్ధతియున్నది. దేశమందంతటా స్వదేశ సంస్థానాలతోసహా రోజు రోజు కార్మిక కర్షక పోరాటాలను స్థానికంగా పెంపొందింప చేయుటయే. ఈ పోరాటాల సంఖ్య నధికము గావించగలిగితే, ఒకానొక దశలో ఇవి తమ స్థానిక రూపము మాని దేశీయ రూపముతో స్వాతంత్ర్య పోరాటముగా పరిణమిస్తాయి. దేశీయులందరికి, స్వాతంత్ర్యయోధులకందరికీ, ఇట్టి పోరాటాలను ద్విగుణీకృతోత్సాహముతో సాగించవలసినదిగ హెచ్చరిస్తున్నాము. అట్టి పోరాటాలకు నేడు కాళీపట్టణము, మునగాల, కాకినాడలు ఉజ్వల ఉదాహరణలు!!

# [illegible]

**బోసు స్టేటుమెంటు**

క్రొత్త వర్కింగు కమిటీలో ఒకే సిద్ధాంతాన్ని అవలంబించే వారు సభ్యులుగా ఉండాలని మహాత్ముని అభిప్రాయమయితే, అట్టి కమిటీలో తనవంటివారికి స్థానం ఎంతమాత్రం ఉండదని బోసు ఒక స్టేటుమెంటులో స్పష్టంగా తెలియజేశాడు ఈ అభిప్రాయంతో పూర్తిగా మేము ఏకీభవిస్తున్నాం. అతివాదులు—మితవాదులు కలిసియున్న వర్కింగు కమిటీ మాత్రమే నేటి జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులలో మన స్వాతంత్ర్య పోరాటాన్ని ముందుకి తీసుకు పోగలదని మా అభిప్రాయం.

అయితే, గోవిందవల్లభపంతు తీర్మానంలో వర్కింగు కమిటీ నియామకాన్ని గురించిన క్లాజు అశాస్త్రీయమని బోసు చెపుతున్నాడు. ఇది సరికాదు. ఒకవేళ ప్రస్తుతమున్న కాంగ్రెసు రూల్సుకు ఇది వ్యతికమే అయితే, రూల్సును మార్చే హక్కు కాంగ్రెసు డెలిగేట్లకు ఉంది. వారు గావించిన నిర్ణయము ఏ విధంగా అశాస్త్రీయమవుతుంది?

వర్కింగు కమిటీని ఏర్పరచే హక్కు అధ్యక్షునికే ఉంది. అయితే గాంధిజీ అంగీకరించని సభ్యుల్ని బోసు నియమించలేడు. గాంధిజీ సూచించిన పేర్లు తన కిష్టం లేకపోతే, నియమించ నవసరములేదు. కాని కాంగ్రెసులో విషమస్థితి తిరిగి ఏర్పడుతుంది. ఎందుకంటే సుభాసును త్రోసి రాజని గాంధీజీ వర్కింగు కమిటీని నియమించలేడు. ఇది దేశానికి అరిష్టదాయకము. అందుచే గాంధిజీ, సుభాసులు ఒక సంయుక్త వర్కింగ్ కమిటీని ఏర్పరచి దేశాన్ని ముందుకు తీసుకుపోతారని కోరుతున్నాము.

**రాజాజీ: గాడిద కథ**

ఈ నెల 26 వ తేదీని మద్రాసులో జరిగిన ఒక బహిరంగసభకు మద్రాసు ప్రధాని రాజాజీ అధ్యక్షతవహిస్తూ యీ విధంగా ఉపన్యసించాడు : "ఈ కాంగ్రెస్ మంత్రివర్గం బలమైన ఒక పెద్దగాడిద. కాని ఆగాడిద మీద విశేషమైన భారం వేయకూడదు. పాతగుడ్డలు, మాసిపోయినబట్టలు యీ గాడిద మోసుకొని పోగలదు. కాని బట్టలు కూడా బరువేగదా!"

మద్రాసు మంత్రివర్గం అనేగాడిద పూర్తిగా ప్రజల బట్టలే మోస్తుంటే. ఎవరూ ఆక్షేపణచేయరు. కాని, వైస్రాయి బట్టలూ, కలెక్టర్ల బట్టలూ, పోలీసులబట్టలూ, సి. ఐ. డి. ల బట్టలు కూడా మోస్తూంది! కనుకనే ఎప్పటికైనా పీళ్లగుడ్డలు క్రింద పడేస్తుందనే ఆశతో ప్రజలు యీ గాడిదమీద క్రొత్త బరువులు వేస్తున్నారు.

మద్రాసు ఎసంబ్లీలో బడ్జట్ గ్రాంట్లపై జరుగుతూన్న చర్చకు రాజాజీ చెప్పే జవాబులుచూస్తే. పై విషయం ఎంత యదార్థంతో కూడుకొనియుందో స్పష్టపడుతుంది. న్యాయ-కార్యనిర్వాహక శాఖల విభజన ఎంత అవసరమో కాంగ్రెసు నాయకులిదివరలో ఉపన్యాసాలిచ్చేవారు. యు.పి. వంటి కాంగ్రెసు రాష్ట్రంలో శాఖా విభజన నేడు అమల్లో ఉంది కూడా. కాని మన రాజధానిలోనో? ప్రభుత్వం ప్రజాప్రతినిధుల చేతుల్లో ఉన్నది కదా అని శాఖా విభజనను కోరడం "నీచమైన దృక్పథా"న్ని తెలియజేస్తుందని రాజాజీ చెప్పాడు శాఖావిభజన అనే విలాసవస్తువును బీద భారతీయులు అనుభవింపతగినది కాదని సమర్థించుకోబోయాడు. అంతేకాదు. కాంగ్రెసుమంత్రులు అధికారానికి వచ్చాక అనేకమంది మేజస్ట్రేట్లు నిష్పక్షపాతమైన తీర్పులే యిస్తున్నారట!

పోలీసు గ్రాంటుపై చర్చకు జవాబుగా రాజాజీ రిజర్వుపోలీసుల అవసరాన్నిగురించీ, సి. ఐ. డి. పోలీసుల అవసరాన్ని గురించీ, సమర్థిస్తూ విదేశప్రభువుల మెప్పులకు పాత్రుడయ్యాడు. ప్రజలు దౌర్జన్యంచేసినప్పుడే రిజర్వుపోలీసులు వెళ్లుతారట! ఇదే నిజం ఐతే. కాళీపట్నం సత్యాగ్రహుల్ని. గర్భిణీ స్త్రీలతోసహా, లాఠీలతో చావ మోదిన రిజర్వుపోలీసుల చర్యను గురించి రాజాజీ ఏమీ అనడేమీ? సి. ఏ. డి. పోలీసులకు రాజకీయేతర పనులు ఎన్నో వున్నాయట. అట్టి పనులకే వారు నియమించబడి వున్నారట. ఇదే నిజం ఐతే, "నవశక్తి" కార్యాలయం ఎదుట ప్రతిరోజూ అరడజను సాధారణ దుస్తుల పోలీసులు ఎందుకో? అనేకమంది కాంగ్రెసు వాదులవెంట సి. ఐ. డి. పోలీసులెందుకో?

**కేంద్ర శాసనసభలో ఆర్థిక చట్టం**

ఢిల్లీ కేంద్ర శాసనసభలో ప్రభుత్వం తరపున ఆర్థిక సభ్యుడు ప్రతిపాదించిన ఫైనాన్సు బిల్లు (ఆర్థిక చట్టం) శాసన సభ్యులచే చర్చించబడింది. ఉప్పుమీద మణుగు 1కి 1.4.0 చొప్పున విధించబడుతూన్న పన్ను రేటును 1-0-0 కి తగ్గించాలనీ; క్రొత్త బడ్జట్ ప్రకారం విదేశీ పత్తిమీద విధించబడ్డ అదనపు దిగుమతి పన్నును రద్దుచేయాలనీ; పోస్టు కార్డు ఖరీదు 3 కానులనుండి అర్ధణాకు తగ్గించాలనీ—కాంగ్రెసు సభ్యులచే ప్రతిపాదించబడిన సవరణలు అధిక సంఖ్యాకులచే ఆమోదించ బడ్డాయి. ఖందసారి రకపు స్వదేశీ పంచదార మీద క్రొత్తగా విధించబడే ఉత్పత్తి పన్ను ఉండకూడదని యస్. కె. హోమిగారొక సవరణను ప్రతిపాదిస్తే. కాంగ్రెసు సభ్యుడయిన రంగాగారు దాన్ని బలపరచినప్పటికీ. యితర కాంగ్రెస్ సభ్యులు ముస్లింలీగ్ సభ్యులతోబాటు తటస్థవిధానం అవలంబించారు. అందువల్ల సవరణ వీగిపోయింది.

కాంగ్రెసు సవరణలన్నీ గెల్చినా ప్రజల కేమీ లాభం లేకపోయింది. వైస్రాయి ఆ సవరణలన్నిటిని త్రోసిరాజన్నాడు. అసలు ఫైనాన్సుబిల్లు (ఆర్థికచట్టమును) ఉన్నది ఉన్నట్లుగానే ప్యాసు చేయాలసినదిగా కోరాడు. కాని అసెంబ్లీ నిరాకరించింది, అయితేమాత్ర మేమిటి? గత 5 సంవత్సరాలుగా ఆర్థికచట్టాన్ని అసెంబ్లీ త్రోసివేయడము, వైస్రాయి పునరుద్ధరించడము మామూలే. ఈ సంవత్సరముకూడ అలాగే చేశాడు. దీనినిబట్టి కేవలం ఆర్థికబిల్లును త్రోసివేస్తే లాభములేదు. ప్రభుత్వాన్నే కూలద్రోయాలని అందరూ తెలుసుకోవాలి.

**పంజాబులో రాజకీయ ఖైదీలు**

పంజాబులో శిక్ష విధించబడిన టెర్రరిస్టు ఖైదీలు 15 మ నేడు జైళ్ళలో ఉన్నారనీ; వారి విడుదలకై అనేక విజ్ఞప్తులు ప్రభుత్వానికి చేయబడ్డాయనీ, కాని విడుదల చేసే ఉద్దేశము ప్రభుత్వానికి లేదనీ, పంజాబు జైళ్ళ శాఖా మంత్రి శాసనసభలో తెలియజేశాడు. వీరు గాక, 6 గురు క్రిమినల్-లా-అమెండుమెంటు చట్టంక్రింద జైళ్లలో నిర్బంధించబడియున్నారనీ. 20 మందికి వాళ్ళ స్వగ్రామాలకు వెళ్ళకూడదని ఉత్తరువు లివ్వబడ్డాయనీ, 7 గురు పంజాబునుంచి బయటికి వెళ్ళగొట్ట బడ్డారనీ కూడా తెలియజేయబడింది. బీహారు వంటి కాంగ్రెసు రాష్ట్రంలో రాజకీయఖైదీలకు ప్రత్యేక తరగతి ఉన్నప్పటికీ, శిక్ష విధించబడిన రైతు సత్యాగ్రహుల్ని రాజకీయ ఖైదీల తరగతిలో చేర్చేటందుకు రాహుల్ సంకీర్త్యాయన్ అనే రైతు నాయకుడు నాల్గు రోజులు ఉపవాసం చేయవలసి వచ్చిందంటే, పంజాబు వంటి కాంగ్రెసేతర రాష్ట్రంలో రాజకీయ ఖైదీలను ప్రభుత్వం విడిచిపెట్టడానికి నిరాకరించడంలో ఆశ్చర్యం ఏముంది?

**బెంగాల్‌లో రహస్య సంఘాలు**

గత సంవత్సరంలో విడుదలచేయబడ్డ బెంగాల్ టెర్రరిస్టు ఖైదీలు, డిటెన్యూలు, తమ తమ రహస్య సంఘాలను మామూలుగానే ఉంచి, సామాజిక విప్లవంకొరకు సన్నాహాలు చేస్తున్నారని బెంగాల్ హోం మంత్రి నజీముద్దీన్ పోలీసు బడ్జెట్‌ను ప్రతిపాదిస్తూ అన్నాడు. వీరంతా పైకిమాత్రం కాంగ్రెస్ సంస్థలో చేరారట. అహింసా సిద్ధాంతానికి కట్టుపడి ఉండరట! విప్లవపద్ధతులద్వారా కమ్యూనిజాన్ని స్థాపించడమే వీరి ఆశయమట.

ఈ ఉపన్యాసం అఖిలభారత కమ్యూనిస్టు దినోత్సవం నాడు (20-3-39) యివ్వబడింది. ఒకవైపు దేశం అంతటా కమ్యూనిస్టుపార్టీపై నిషేధాన్ని తొలగించవలసిందంటూ ఆందోళన చేస్తూంటే మరొకవైపు నజీముద్దీన్‌కి విడుదల అయినఖైదీలందరూ కమ్యూనిస్టులైనారు!

**ఆంధ్ర రాష్ట్రంగతి**

ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణంవిషయంలో ఇండియా సెక్రటరీ ప్రతికూలవైఖరిని ప్రకటించినట్లు మద్రాసు ఎసంబ్లీలో రాజాజీ తెలియజేశాడు.

భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణాన్ని గురించి ఎసంబ్లీలో ఏకగ్రీవంగా తీర్మానం ఆమోదించబడటం, ఇందు విషయమయి ప్రధాని గట్టిగా సిఫార్సుచేసినట్లు ఎసంబ్లీ సభ్యులకు నచ్చ జెప్పడం జరిగాక కూడా ఇండియా సెక్రటరీ ప్రతికూల వైఖరిని ప్రదర్శించాడంటే విదేశీ ప్రభుత్వంయొక్క మొండితనాన్ని తెలియజేస్తుంది.



# ఇండో-బ్రిటిష్ వర్తకపుటొడంబడిక

## మన పరిశ్రమల యెడల బ్రిటిషు వారి సవతి తల్లి ప్రేమ

కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణ, ఎం. ఏ.,

సుమారు రెండు సంవత్సరాల నుంచి రాయబారాలలోఉన్న ఇండో-బ్రిటిష్ వర్తకపు టొడంబడిక యిప్పుడు బయటపడింది. ఇండియా ప్రభుత్వ ప్రతినిధులూ, బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధులు దానిపై యీనెల 21 వ తేదీని సంతకాలు చేశారు.

ఈ ఒడంబడిక ప్రకారం :

1. భారతదేశం బ్రిటన్‌కుచేసే పత్తి ఎగుమతులకూ, బ్రిటన్ నుండి మనం తెచ్చుకొనే బట్టల దిగుమతికీ లంకె యేర్పడింది.

2. బ్రిటన్‌నుండి దిగుమతి అయే అద్దకపు వస్త్రాల విలువమీద 100 కి $17\frac{1}{2}$ వంతుల చొప్పునా, కోరాగుడ్డలమీద 100 కి 15 వంతుల చొప్పునా, దిగుమతిపన్ను విధించబడుతుంది.

3. బ్రిటన్‌నుండి ప్రతి సంవత్సరం 35 కోట్ల గజాలకు తక్కువకాని బట్టలు దిగుమతి చేసుకోవడానికి ఇండియా గ్యారంటీ యిస్తోంది. ఈసరకు పూర్తికావడానికి 100 కి $2\frac{1}{2}$ చొప్పున పై దిగుమతి పన్ను రేట్లను తగ్గించుకోవచ్చు. లేదా, బ్రిటిష్ దిగుమతులు 50 కోట్ల గజాలకు మించి యుండేటట్లయితే, పై సుంకపు రేట్లు ఎక్కించుకొని తద్వారా అదనపు దిగుమతుల్ని అరికట్టుకోవచ్చు.

4. ఇదేవిధంగా బ్రిటన్ మన దేశాన్నుంచి ప్రతియేటా 4 లక్షల బేళ్ళకు తక్కువకాని పత్తిని కొనడానికి గ్యారంటీ యిస్తోంది. మనం బ్రిటన్ దేశాన్నుంచి కొనుక్కునే బట్ట హెచ్చే కొద్దీ బ్రిటన్‌కూడా మన పత్తిని యీ 4 లక్షల బేళ్ళకంటే ఎక్కువగా కొంటుంది. మన దేశానికి వచ్చే బ్రిటిష్ దిగుమతులు 50 కోట్ల గజాలకు మించినప్పుడుగాని, మన దేశం నుంచి వెళ్లేపత్తి ఎగుమతులు $7\frac{1}{2}$ లక్షల బేళ్ళకు మించినప్పుడుగాని, ఉభయ ప్రభుత్వాలు తమ తమ దిగుమతి సుంకపు రేట్లను హెచ్చించుకోవచ్చును.

5. ఇండియాకు దిగుమతిఅయే సరకులలో 100 కి 16 మీద మాత్రమే పన్ను ఉండదు. ఇండియానుండి ఎగుమతి అయే సరకులలో 100 కి 82 సరకులు బ్రిటన్ దేశంలో పన్ను చెల్లించనవసరం లేదు.

6. భారతదేశంనుంచి ఎగుమతియగు సరకులలో నూనె గింజలు, నార, నూలు, తోళ్లు, వేరుసెనగ, అవిసెగింజలు, మైనం, గానగపిండి—వీటిపై సుంకముల రేటు 100 కి 10 చొప్పున తగ్గించబడింది.

భారతదేశపు దిగుమతి సరకులలో సిమెంటు మందులు, మందు సామగ్రులు, బట్టలతుండ్లు, ఉన్నితివాసీలు, కుట్టుపని యంత్రాలు, కొన్ని ఎలెక్ట్రిక్ సామాన్లు, వైర్లెస్ సరకులు, బైసికిళ్లు, ఫోటోగ్రాఫ్ సామాన్లు—వీటిమీద దిగుమతి సుంకపు రేట్లు 100 కి 10 చొప్పున తగ్గించబడ్డాయి.

ఒడంబడిక యొక్క ఉద్దేశం,

పై షరతుల్ని జాగ్రత్తగా పరిశీలిస్తే. భారతీయుల విషయంలో బ్రిటిష్ ప్రభుత్వం-ఇండియా ప్రభుత్వం కలిసి, "నీకంట్లో నేను వేలు పెడతా; నాకంట్లో నువ్వు వేలుపెట్టు" అనే వైఖరిని ప్రదర్శిస్తూన్నట్లు స్పష్టపడుతుంది. బ్రిటిషు పెట్టుబడిదార్ల లాభాలకోసం యేర్పడ్డ ఇండియా ప్రభుత్వం లంకషైర్ బట్టల వ్యాపారస్తుల కోరికలను సఫలీకృతం గావించడానికే యీకొత్త వర్తకపుటొడంబడిక చేసుకొంది. బ్రిటిషు వస్త్రాలమీద మొదట్లోఉన్న 25% (నూటికి 25 వంతులు) దిగుమతి సుంకం క్రమక్రమంగా 20% కి దింపబడింది. ఇప్పుడది 15% కి వచ్చింది. స్వదేశీ బట్టల పరిశ్రమ బ్రిటిషువారి యీ పోటీకి ఎట్లా కాచుకోగలదో తెలియదు. అంతేగాక, ప్రతియేటా మనము బ్రిటన్‌నుండి 35 కోట్ల గజాలకు తక్కువకాని బట్టను దిగుమతి చేసుకోవాలి కాని గత సంవత్సరం 26 కోట్ల గజాలకుపైగా మాత్రమే మన దేశానికి దిగుమతి చేసుకొన్నాం. ఈయేడు 20 కోట్ల గజాలబట్టనే మనము తెప్పించుకోవలసి యుంటుందని ఇండియన్ ఛాంబర్ అఫ్ కామర్సువారు అంచనావేశారు. కాని ఒడంబడిక ప్రకారము మన కవసరములేని బట్టను మరి 15 కోట్ల గజాలు తెప్పించుకోవాలి. నేడు అనేక స్వదేశీ మిల్లులలో నిల్వగా పడియున్న సరకు విడుదల కావడానికి కొంతకాలం పట్టుతుంది కాబట్టి వచ్చేయేడు ఈ 20 కోట్ల గజంకంటెకూడా దిగుమతులు తగ్గుతాయి. అప్పుడు కూడ ఒడంబడిక ప్రకారము 35 కోట్ల గజాలు తెప్పించుకోవలసి యుండుటచే 100 కి $2\frac{1}{2}$ చొప్పున దిగుమతి సుంకాలను ఇంకను తగ్గించవలసి యుంటుంది. అసలే తీవ్రంగాఉన్న పరిస్థితులింకా తీవ్రమౌతాయి. బ్రిటిషువారి పోటీ యిప్పటికంటె హెచ్చుతుంది. ఈవిధముగా, మన బట్టల పరిశ్రమ కీయబడుతూన్న రక్షణ 3 సంవత్సరాలలో 100 కి 50 వంతులచొప్పున తగ్గుతుంది. దీనికితోడు, మొన్న యీమధ్య కేంద్రబడ్జటులో విదేశాలనుంచి మన దేశానికి దిగుమతిఅయే ముడి పత్తిమీద దిగుమతి సుంకము రెట్టింపు చేయబడింది. ఇందువల్ల, మన మిల్లుల ఉత్పత్తి ఖర్చులు హెచ్చుతాయి. తద్వారా యిప్పుడున్న రక్షణ 100కి 8 వంతుల చొప్పున తిగ్గిపోతుందని ఛాంబర్ ఆఫ్ కామర్సువారి అంచనా. గ్రేట్‌బ్రిటన్‌వద్ద నేడు మనం కొనుక్కొంటూన్న 20 కోట్ల గజాలకు బదులు 35 కోట్ల గజాలకు తక్కువ కాకుండా కొనుక్కోవాలంటే, దానిఅర్థం సంవత్సరానికి 15 కోట్ల గజాలబట్టను తయారు చేయడం మానివేయాలన్నమాట. అంటే, మన మిల్లు యజమానులకు మామూలుగావచ్చే లాభాలు తగ్గిపోవడమే కాకుండా మిల్లులలో పనిచేసే కూలీలు కూడా నిరుద్యోగులు కావడమో, వారి జీతాలు తగ్గించడమో, జరుగుతుందన్న మాట.

### పత్తి ఎగుమతులు

ఇండియా ప్రభుత్వంయొక్క అనధికార సలహా సంఘంవారు గతసంవత్సరం సెప్టెంబరు మాసంలో ఇచ్చిన రిపోర్టు ప్రకారం, ఇండియన్ సెంట్రల్ కాటన్ కమిటీవారి అంచనానుండి ప్రతియేటా 10 లక్షల బేళ్ళ పత్తిని తెప్పించుకొని ఉపయోగించు కోడానికి అవకాశం ఉన్నదని నిరూపించారు. కాని, యిప్పుడు జరిగిన ఒడంబడిక ప్రకారం, 4 లక్షల బేళ్ళకు తక్కువకాకుండా మాత్రమే బ్రిటన్ తెప్పించుకోవాలి. గత 3 సంవత్సరాల లెక్కలుచూస్తే, యీ 4 లక్షల బేళ్ళ ఒక సంవత్సరంయొక్క సగటు బేళ్ళకంటె తక్కువ. 1938 తో అంతమైన మూడు సంవత్సరాలలో, సంవత్సరానికి సగటున 4, 87, 000 బేళ్ళ చొప్పున మనం బ్రిటన్ దేశానికి ఎగుమతి చేశాం. కాని, ఒడంబడిక ప్రకారం 4, 00, 000 బేళ్ళ చొప్పున ఎగుమతిచేస్తే సరిపోతుంది. అందుచే ఒడంబడికవలన మన ప్రత్తిని ఎగుమతి చేసేవారిక్కి గాని, పండించేవారికి గాని ప్రత్యేక సౌకర్యమేమీ కలుగలేదు.

### సవతి తల్లి ప్రేమ.

బ్రిటను దేశాన్నుండి మనకువచ్చేసరకులపై కన్న తక్కువ పన్ను వేస్తూవచ్చాము. ఇప్పుడీ క్రొత్త ఒడంబడికవలన 20 వస్తువులమీదనే తక్కువ పన్నులు వేయాలి. మిగిలిన 86 వస్తువులపై మన యిష్టము వచ్చినట్లు పన్నులు వేయుటకు హక్కు వుంది. ఇది మనకు మునుపటికన్న ఎక్కువ లాభకరమని ఇండియా ప్రభుత్వ ప్రతినిధులు వాదిస్తారు. అంతేగాక ఆ 20 సరకులైనా మన దిగుమతులలో చాల స్వల్ప భాగమేనని అవి 18 కోట్ల రూపాయల కన్న ఎక్కువ ఉండదని వాదిస్తారు,

కాని దిగుమతి సుంకాలు చెల్లించనవసరము లేని ఈ 20 సరకులలో సిమెంటు, మందులు ద్రావకాలు మొట్టమొదటనేచేర్చబడ్డాయి. ఇవన్నీ మనదేశంలో నేడు విరివిగా ఉత్పత్తిఅవుతున్నాయి. అందుచే ఇక మనదేశములోని సరకులతో పోటీచేసి మనపరిశ్రమలకు నష్టము కలిగిస్తాయి. ఇక మనదేశాన్నుంచి బ్రిటన్‌కి ఎగుమతి అయే సరకులెట్టివో చూద్దాం. ఇంచుమించు అన్నీ ముడి సరకులే. అవి బ్రిటిషు పరిశ్రమలకు చాలా అవసరం. ఇతర పారిశ్రామిక దేశాలలో మాదిరిగా బ్రిటన్‌కూడా, తన పారిశ్రామికాభివృద్ధి కొరకు, ముడి సరకులమీద పన్ను విధించకుండా ఉండడం ఆశ్చర్యంకాదు. అదీ గాక విపరీతమైన వేగంతో ఆ యుద్ధ సన్నాహంలో నిమగ్నమైయున్న గ్రేట్ బ్రిటన్‌కి మన ముడి సరకులు చాలా అవసరం. అదీ కాక, జూట్, మైకా మొదలయిన ముడి సరకుల ఉత్పత్తికి ఇండియా యితర దేశాలకంటె ప్రసిద్ధి గాంచింది. మన దేశము వీనిలో 'మొనాపలీ'ని కలిగియున్నది. అందుచే బ్రిటన్‌కి యిష్టం ఉన్నా లేకపోయినా, మన దేశంనుంచి తప్ప మరొక దేశంనుంచి తెప్పించుకోడానికి వీలులేదు. ఇక తేయాకువంటి ఇతర సరకుల ఉత్పత్తి అంతర్జాతీయ పెట్టుబడిదారులు గావించుకొంటూన్న ఒడంబడికలమీద ఆధారపడియుంది. కాబట్టి వీటిమీద బ్రిటన్ సుంకాలు విధించకుండా ఉండడమువల్ల ఎవరికి లాభమో తెలుస్తూనే ఉంది. బ్రిటన్ మన దేశంయెడల కనపరుస్తూన్నట్లు నటిస్తూన్న ప్రేమ సవతి తల్లి ప్రేమ తప్ప మరొకటికాదని స్పష్టంగా చెప్పవచ్చును.

ఈ ఒడంబడికమీద సోమవారం నుంచి కేంద్ర శాసనసభలో చర్చ జరుగుతోంది. కాంగ్రెసు సభ్యులందరూ ఒడంబడిక షరతుల్ని ఖండిస్తున్నారు, కాని, బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధులు, ఇండియా ప్రభుత్వ ప్రతినిధులు ఒడంబడికమీద యిదివరకే సంతకాలు చేశారు. శాసనసభలో అధిక సంఖ్యాకులు ప్రభుత్వానికి వ్యతిరేకంగా వోటు చేసినప్పటికీ ప్రభుత్వం ఒడంబడికను అమలులోపెట్టి తీరుతుంది. సందేహం ఏమాత్రమూ ఉండదు.

ఏ వర్తకపుటొడంబడికయైనా, మనదేశీయ ఆర్థికజీవనమును పెంపొందించడానికి తోడ్పడునదై ఉండాలి. అట్టావా ఒడంబడికను మనదేశస్థులు తీవ్రముగా ప్రతిఘటించుటకు కారణము బ్రిటిషు సరకులకు ప్రత్యేక సౌకర్యము కలుగజేయుటవలన, ఇతరదేశాలతో అనుకూలమైన వర్తకపుటొడంబడికలు చేసుకోడానికి వీలులేకపోతుందని, ఈ క్రొత్త ఒడంబడికలోకూడ ఆ చిక్కువదలలేదు. అంతేగాక మన ఎగుమతులు ప్రధానముగా ముడి సరకులై యున్నంతకాలము వీనిని ఇంగ్లండులోనేగాక ఇంకను ఇతరదేశాలలో అమ్ముటకు మన కవకాశముంది. పైగా మన ముడి సరకులకు మన దేశములోనే మనకు కావలసిన పరిశ్రమల నెలకొల్పి వినియోగించుకోడానికి ప్రయత్నించాలి. దేశములోని పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడని వర్తకమును, వర్తకపు టొడంబడికలను దేశీయులు బలపరచజాలరు. అందుచే మన ముడి సరకులకు బ్రిటనులో కొంత సౌకర్యము కల్గినదని. మన శత్రువగు బ్రిటిషు ప్రభుత్వానికి ప్రత్యేక సౌకర్యాలు ఈ దేశములో కల్గించడముకూడ భారతీయులు అంగీకరించరు. ఇంతకూ మన ముడి సరకులకుకూడ ఒడంబడిక మూలంగా ఎంత లాభముంటుందో చెప్పజాలము. 1935-36 లెక్కలనుబట్టి కేవలము 11 కోట్లు విలువ గల వస్తువులకు మాత్రము కొంత సౌకర్యము కలిగినట్లు అంచనా వేయబడింది.

మన స్వరాజ్యపోరాటంలో ఒక భాగంగా ఉన్న స్వదేశీ పెట్టుబడిదార్లకు యీ ఇండో—బ్రిటిషు ఒడంబడిక ఎంతో ఆశాభంగాన్ని కలిగిస్తోంది. దీనిలో ఆశ్చర్యంకూడా ఏమీలేదు, బ్రిటిష్ పెట్టుబడిదార్ల పెత్తనం మన దేశంలో కొనసాగాలంటే, దేశీయ పెట్టుబడిదార్లతో లడాయితప్పదు. కాబట్టి, స్వదేశీ పరిశ్రమలు అభివృద్ధి పొందాలంటే, పరప్రభుత్వాన్ని తొలగించాలి. బ్రిటిషు సామ్రాజ్యవాద దోపిడీలో నలిగి కృశిస్తూన్న భారత కార్మికులు—కర్షకులు సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకు నేడు సల్పుతూన్న పోరాటంలో మన పెట్టుబడిదార్లుకూడా విరివిగా పాల్గొనాలి. పూర్వంకంటె విరివిగా పాల్గొనాలి. ఇండో బ్రిటిష్ వర్తకపు టొడంబడిక మనకు నేర్పే పాఠంయిదే.



★ కథ

# సరిహద్దుమీద

ముల్కరాజ్ ఆనంద్

కరీమా, అబ్దుల్ రహిమాన్ కూతురు, మిట్టమధ్యాహ్నపు ఎండవేళ, నెత్తిపైన గంప పెట్టుకుని, పేడ పోగు చేసుకోడానికి పూరు పైటికి పచ్చింది. కోసివేసిన జొన్నచేను గట్టేబడి పశువులు మేసేకొండ ప్రదేశానికి బయలుదేరింది. అటుఇటు తేరిపార జూచింది, కనుచూపు మేరలో ఎక్కడా పశువులజాడ గాని, మనుష్యులజాడగాని ఆమెకు కనబడలేదు.

కొంత దూరంపోయాక, నిలబడి, ఒక చేత్తో నెత్తిమీది గంపను పట్టుకుని, రెండోచెయ్యి కంటికి మాటు పెట్టుకుని కొండమీది చిన్నచిన్ని పొదలకేసి దృష్టినిని గుడించింది ఏమేకపిల్లో,అవుదూడో మందలోంచి విడిపోయి కొరకపరకలు పొదలప్రక్కనడానికి వస్తూంటాయని కరీమాకు తెలుసు,కాని ఆనాడు అటువంటి దృశ్యాలేవీ కన బడలేదు.ఎక్కడా పచ్చని గడ్డిపరకలున్న ప్రదేశంలేదు. పర్వతాలు మాత్రం ఎండకు వేడెక్కినపొట్టలు ముందుకు పారవేసి ఆమె కెదురుగా నిలబడ్డాయి.

తొడుక్కున్న చెప్పులు చిరిగిపోయిన వదడంచేత కాళ్ళు కాలుతున్నాయి. ఎక్కువసేపు నిలబడలేక పోయింది. ప్రొద్దున్న విమానాలు వాళ్ళపూళ్ళో జారవిడిచిన కాగితపు ముక్కలు చిల్లులకు మాటుపెట్టింది,గాని అవి ఎక్కడో జారిపోయాయి. "కొత్తజోడు తెచ్చిపెడతానని వాగ్దానం చేశాడు ఇంతవరకు తనమాట నెరవేర్చలేక పోయాడు" అని తనలో తాను గొణుక్కుంది. పెషావరు వెళ్ళిన షామూస్‌ను. ఖాన్‌సాహెబ్ (అబ్దుల్ గపూర్‌ఖాన్ సోదరుడు) చెప్పినమాట విన్నాడని అంగ్రేజీ సర్కారు ఖైదులో పెట్టారన్నపుకారు తప్పితే. అతను వెళ్ళిన దగ్గరనుంచి కరీమాకు అతనిని గురించిన వార్త లేమి తెలియలేదు.

షామూస్ తలపుకు రాగానే కరీమాకు కడుపులో చేయివేసి కలిపి వేసినట్లయింది, మొహానికి కొడుతూన్న వెచ్చనిగాలికి ఆమె లేతచెక్కిళ్ళు ఎర్రబారాయి ఏమేమో వెనుకటి సంగతులన్నీ జ్ఞప్తికి వచ్చాయి.

అతడు సిగ్గుమాలిన పనులెన్నో చేసేవాడు: 'కరీమా అబ్దుల్ రహిమాన్ కూతుర, నీచెక్కిళ్ళు దానిమ్మపండు కంటె, గులాబిరేకలకంటె అందమైన,వంటూ, కొంత ఏడిపించడానికి కొంత నిజంగాను అన్నట్లుగా ఆమెదగ్గర సంగీతాలు తీస్తుండేవాడు. అతనికి ఉల్లాసం కలిగినప్పుడల్లా, ఆమె వెల్లడించే అసమ్మతులను లెక్కజేయకుండా బలవంతాన కౌగిలిలోకి లాక్కుని మృదువైన చెక్కిళ్ళు వేడెక్కి పగిలిపోతాయా అన్నంతగా ముద్దులు కురిపించేవాడు, బిగువైన అతని కౌగిలిలో పడి నలిగిపోయేటప్పుడు తానసుభవించినసౌఖ్యం తలుచుకుంటే ఆమెకు ఒళ్లు పులకరించింది,

అతడు సిగ్గు మాలిన మాట లెన్నో అనేవాడు: "కరీమా అబ్దుల్ రహిమాన్ కూతుర, నీ చెక్కిళ్ళు దానిమ్మపండుకంటె, గులాబీ రేకలకంటె అందమైనవి. కాని నీవు దుర్బుద్ధు లెన్నో కలిగిస్తావు". ఆమె కడుపుతో టుండగా ఒకనాడు మసీదు దగ్గర నూతివద్ద స్నానం చేసివచ్చి అతనితో అంది, "కడుపులోని పిల్లవాడు తన్నుతున్నట్లుగా వుంది" అని.

"కరీమా, అబ్దుల్ రహిమాన్ కూతుర, నీ చెక్కిళ్ల దానిమ్మపండుకంటె, గులాబీ రేకలకంటేఅందమైనవి, నీ కడుపులోని పిల్లవాడు పైకిరావాలని గంతులు వేస్తున్నాడు, నాకు తెలుసు. వాడు వాళ్ళనాన్నకంటే కొంటెవాడౌతాడు" అన్నాడతడు.

ఆమె తలయెత్తి మళ్ళీ కొండకేసి చూసింది. ఎండ వేడిమికి నిప్పులు గ్రక్కుతున్న ఆ పర్వతసీమలో కూడ ఆమె కంటికి, ఇంటివద్ద నిద్రపుచ్చివచ్చిన తన కుమారుని స్వరూపమే స్ఫురించింది.

షామూస్ ఇల్లు విడిచిపెట్టి వెళ్ళి సంవత్సరం కావచ్చింది. అంగ్రేజీ సర్కారు అతనిని ఎంతకాలం బంధించి వుంచుతారో తెలియదు. ఆమె పర్వతాన్ని అడిగింది. "నీకు తెలుసా, షామూస్ చచ్చిపోలేదని" అని గంభీర నిశ్శబ్దత పూని వేడినిట్టూర్పులు విడుస్తున్న ప్రకృతిని ప్రశ్నించింది. "నీకు తెలుసా షామూస్ చచ్చిపోలేదని" అని, ఆ పారవశ్యంలో ఆకాశంవైపు చూచి స్వర్గాన్ని ప్రశ్నించింది, "నీకు తెలుసా, షామూస్ చచ్చిపోలేదని" అని. చివరకి తన్ను తాను ప్రశ్నించుకుంది. "షామూస్ నిజంగా బ్రతికివున్నాడా" అని. షామూస్ బ్రతికివుంటే తాను అంగ్రేజీ సర్కారుకు, వజీరుస్థాన్‌కు రోడ్లు వేయడానికి తీసుకుపోయే రాళ్ళు కొట్టిపెట్టియైనా జీవించాలని నిశ్చయించుకుంది.

సున్నితమైన నుదుటిమీద పోసిన చెమట బిందువులు తుడుచుకుంది. తెల్లవాళ్లకి రాళ్ల కొట్టిపెడుతున్నానంటే మా షామూస్‌కు తెలిస్తే సహిస్తాడా అనుకుంది. తెల్లవాళ్ళ రోడ్లు వేయడం తమ సైన్యాల్ని తీసుకొచ్చి మనజనందరిని కాల్చి చంపడానికేనని చెప్పుకుంటారు. కాని అంతకంటె ఏమి చేయగలదు? తాను జీవించాలి, తన కొడుకును బ్రతికించుకోవాలి. షామూస్‌లాగ తాను పొలందున్ని వ్యవసాయం చేయలేదుకదా, ఇంటివద్ద తిండికి గింజలులేవు. అటువంటప్పుడు రాళ్లు కొడితే తప్పేమిటి? "ఇతరులు ఏమైనా అనుకోనీ, నా చేతనైన పనిచేసి నే నీ కుర్రవాడ్ని పెంచుకోవాలి. అప్పుడే రహిమత్ (తన కొడుకు) ఎంతవాడయాడు? అచ్చంగా వాళ్ళ తండ్రి లాగే వుంటాడు. ఏమి అల్లరి చేస్తాడు, ఏమి అల్లరి! నిజముగా వాళ్ల తండ్రికంటె కొంటెవాడౌతాడు వాడు. ఈపాటికి లేస్తాడేమో! నేనింకా ఇక్కడే తిరుగుతున్నాను........"

మళ్ళీ అటూ ఇటూ చూసింది. అక్కడెక్కడో పశువులు నీళ్లు తాగే గుంట వుండాలి. తాను నిలబడి వున్న రాయి చుర్రుమని కాలుతోంది. రెండడుగులు వేసి చుట్టూ పరికించింది. అమ్మయ్య! ఆ కొండలోవలో ఒక మేకలమంద వున్నట్లుంది అక్కడికి పోతాననుకుంది. రాతి పలకమీదనుంచి క్రిందికి దూకింది. దూకిన చోట పాము కన్నాలలాంటివి కనబడ్డాయి. ఒళ్లు ఝల్లుమంది. ఆ కొండరాళ్ళలలో పాములెక్కువగా వుంటాయని వినికిడి. ఒక అడుగు ముందుకువేసి ఆగి. వెనక్కి తిరిగి తలవంచి కన్నములోకి చూసింది. కాలితో పుట్టను అటుఇటు కెక్కరించింది........

ఏదో బుస్సుమన్నట్లు శబ్దం........

ఆమె గుండె దడదడ కొట్టుకుంది. తాను కాలుతో కెక్కరించిన కన్నములోనుంచి ఆ శబ్దము రావడము లేదు. కాని ఎక్కడినుంచి వస్తోందో బోధపడలేదు. భయంతో తొందరగా ఒక రాతిమీదనుంచి ఒక రాతిమీదికి గెంతుకుంటూ లోవలోకి పరుగెత్తింది. క్రిందికి వెళ్లి నిలబడిపోయింది. కాళ్లు వణుకుతున్నాయి. ఒక్క తృటి కాలము ఆమె ముందున్న ప్రకృతి అంతా పౌరగ్రమ్మి నట్లయింది. భయంతో గట్టిగా కొట్టుకుంటున్న గుండె చప్పుడు తప్ప ఆమెకేమీ తెలియలేదు.

అయినా, ఊపిరి బిగబెట్టి, ధైర్యముచేసి వెనక్కి తిరిగి చూసింది. తనను తరుముకువచ్చేది పామో, కొండపిల్లో చూద్దామని.... ...

ఆమె భయపడినట్లు ఆ శబ్దము వస్తూన్నది ఆ పుట్టలోంచికాదు, లోవలోంచీకాదు. ఆకాశముమీదనుంచి. అమ్మయ్య! కొంచెము ధైర్యము చేకూరింది. మాయ పుట్ట! ఎంత భయపెట్టింది! భయముతో ఆమె గుండె ఆగిపోయినట్లయింది. పెనుగాలిలోని లతవలె కంపించి పోయిందామె!

రాను రాను శబ్దము ఎక్కువైంది. పొగమబ్బులాంటి ఆకాశాన్ని చీల్చుకొని, కవురువచ్చేముందు రాబందులు వచ్చినట్లు విమానాలు వచి పడ్డాయి. వాటి రాకకు సూర్యకిరణాలుకూడ కంపించినట్లయింది. అవి ఏమిటో గొట్టాలలాంటి పదార్థాలను క్రిందికి జారవిడుస్తున్నాయి.

కరీమా చూస్తుండగానే ఆగొట్టం ఒకటి కమ్మరి డిన్‌గల్ ఇంటిదగ్గరపడి, పెద్ద ధ్వనితో ప్రేలింది. ప్రేలడంతోటే నల్లని పొగ ఆ ప్రదేశాన్నంతనీ కమ్మేసింది. అదేమిటో ఆమె ఆలోచించేలోపుగానే ఇంకొక గొట్టం భూమిమీదపడి అప్రదేశాన్నంతనీ బ్రద్దలు చేసేసింది. వెయ్యికుండలు ఒక్కసారి బ్రద్దలైనా అంత శబ్దంరాదు. దానివెంటనే ఇంకోటి, మరల ఇంకోటి ఇల్లా బాంబులు పిడుగుల వర్షంలాగ పడుతున్నాయి. ఇదంతా ఖురాన్‌లో చెప్పిన ప్రళయ చిహ్నంలాగ తోచిందామెకు.

ఇదంతా చూస్తూంటే ఆమె హృదయంలో నిప్పులుపోసినట్లుంది. "నా బిడ్డ! నా బిడ్డ" అని గొంతుక దాటి పైకి రాని స్వరంతో అరిచింది. గ్రామంకేసి పరుగుతీసింది.

విమానాలు ఆకాశంలో ఒకమూలనుంచి ఇంకో మూలకి ప్రళయ జీమూతాలలాగ సంచారంచేస్తున్నాయి.

(మిగతా 19 వ పేజీలో)



# కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించాలి.

## అన్ని రాష్ట్రాలలో ఆందోళన.

### బొంబాయి

మార్చి 20 వ తేదీని చౌపట్టీలో బొంబాయి రాష్ట్ర ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ యొక్క, కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ యొక్క, సంయుక్త యాజమాన్యాన ఒక బహిరంగసభ, బొంబాయి గిర్నీ కాంగార్ యూనియన్ యొక్క, కాంగ్రెస్ సోషలిస్టు పార్టియొక్క, యాజమాన్యాన ఫెర్గూసన్ రోడ్‌లో మరొకసభ, భారత పౌరసత్వపు హక్కుల సంస్థతరపున, నార్తు బొంబాయి విద్యార్థి సంఘం తరపున మాతుంగలో మూడవసభ, జయప్రదంగా జరిగాయి.

కామ్రేడ్ యస్. యస్. మిరాజ్‌కర్‌గారు ఉపన్యసిస్తూ, దౌర్జన్యం-దౌర్జన్యరాహిత్యం అనే సిద్ధాంతాలకు ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చి, స్వారాజ్య సమస్యను మరుగు పర్చడం మననాయకులకు తగినపని కాదన్నారు. వెంటనే మనకర్తవ్యం స్వరాజ్య సంపాదన కాబట్టి బలమైన సామ్రాజ్యవ్యతిరేకులుగా పనిచేస్తూన్న కమ్యూనిస్టుల్ని తమపార్టీని ఏర్పరచుకోనివ్వక పోవడం మిక్కిలిఅన్యాయం అని ప్రభుత్వచర్యను ఖండిస్తూ కె. యన్. జోగ్లేకర్‌గారు ఉపన్యసించారు. స్పెయిన్, చైనా దేశాలలో స్వాతంత్ర్య సంపాదనకై అక్కడి కమ్యూనిస్టుపార్టీలు ఏవిధంగా పోరు సల్పుతున్నాయో కామ్రేడ్ బి. టి. రణదివేగారు ఉదాహరిస్తూ మాట్లాడారు. సుప్రసిద్ధ బొంబాయి కాంగ్రెసు నాయకులైన కె. యఫ్. నారిమన్‌గారు, భారత పౌరసత్వపు హక్కుల సంస్థతరఫున కె. బి. మీనన్‌గారు కూడ ఉపన్యాసాలిచ్చారు.

కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించవలసిందని బొంబాయి ప్రభుత్వాన్ని కోరుతూ పైసభ లన్నింటిలోనూ తీర్మానాలు గావించబడ్డాయి.

* * *

### కలకత్తా

ఈనెల 20 వ తేదీని కమ్యూనిస్టు పార్టీ దినోత్సవాన్ని జరుపుటకు సాయంత్రం కలకత్తా, శ్రద్ధానంద పార్కులో, బహిరంగసభ జరిగెను. అనేక వేలమంది ప్రజలు సభకు హాజరయారు. అనేకమంది విద్యార్థులు. కార్మికులు, వేర్వేరు ఊరేగింపులతోవచ్చి సభ నలంకరించారు. మధ్యమధ్యను "కమ్యూనిస్టుపార్టీపై నిషేధాన్ని తొలగించాలి" మొదలైన నినాదాలతో సభ దద్దరిల్లింది. దూరశ్రవణ యంత్రాలు కూడా ప్రజల సౌకర్యార్థం అమర్చబడ్డాయి. అఖిలభారత ఆంగ్లో-ఇండియన్ పౌరసత్వపు హక్కుల సంస్థకు అధ్యక్షుడైన సి. ఋ. గిబ్బన్సు (కాంగ్రెసువాది) సభ కధ్యక్షుడుగా ఉండెను, శ్రీయుతులు హేమంతకుమార్ బోసు సోమనాథ లాహిరీ, క్షితీశచంద్ర ఛటర్జీ మొదలైనవారు ఉపన్యసించారు. గిబ్బన్సు తన అధ్యక్షోపన్యాసంలో యీ క్రిందివిధంగా చెప్పాడు:—

"సరిగా ఒక సంవత్సరంక్రితం మన యీ కోర్టును అనేకవేలమంది కాంగ్రెసువాదులు, కార్మికులు, కర్షకులు బహిరంగంగా తెలియపరచినప్పటికీ దీనిపై ఎట్టిచర్యతీసుకొనబడలేదు. ఈ విషయంలో కాంగ్రెసు మహాసంస్థ ముఖ్యముగా కాంగ్రెసు మంత్రివర్గాలు, జోక్యం కలిగించుకొని నిషేధం తొలగించడానికి వెంటనే కేంద్రప్రభుత్వం మీద బలమైన ఒత్తిడి కలుగజేయాలని నా అభిప్రాయం. మనదేశంలో పీడిత కార్మికులు, కర్షకులు తమ పార్టీని యేర్పాటు చేసుకొనే హక్కు కేంద్ర ప్రభుత్వం చేత అపహరించబడింది. ఈ అన్యాయానికి కాంగ్రెసు మంత్రివర్గాలు కూడా కొంతవరకు బాధ్యులని చెప్పసాహసిస్తున్నాను. నా అభిప్రాయం తప్పుకావచ్చు. కాని, మనుష్యులు చేసే పనులు గ్రంథంచివర ఉండే 'ఇండెక్సు' వంటివనే" లోకోక్తిపై నేను ఆధారపడున్నాను. ఈ ప్రధాన సమస్యను పరిష్కరించడానికి కాంగ్రెసు మంత్రులకు రెండు సంవత్సరాల వ్యవధి ఉంది. అయినా భారతీయులందరియొక్క పౌరసత్వపు హక్కుల్ని కాపాడాలని దీక్షగైకొన్న కాంగ్రెసు సంస్థ తరపున అధికారంలో ఉన్న మంత్రివర్గాలు యీ విషయంలో నిర్లక్ష్యతను చూపుట అర్థం కావడం లేదు.

"స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం—వీటి కొరకు నేడు మనం గొంతెత్తి అడుగుతున్నాం. మనల్ని 'ఆందోళనా పరుల'నే పేరుతో పిలిచి, జైళ్లలో విసిరివేయవచ్చు. కాని, కొన్ని సంస్కరణలకొరకు ప్రజలుచేసే ఆందోళనను ప్రమాదకరమైనట్టిదిగా భావించి, దాన్ని అణచ ప్రయత్నిస్తే ఏ విధంగా వ్యర్థమో చరిత్ర చదివిన వారందరికీ తెలుస్తుంది. గొప్ప గొప్ప సమస్యలపై మనం ఉద్రేకులం కావాలనే నా విశ్వాసం! పెద్ద పెద్ద అక్రమాలను అరికట్టడానికి ఆందోళన తప్పనిసరిగా అవసరం.

"జాతీయ కాంగ్రెసు సంస్థ ప్రజా ప్రభుత్వం కోరుతుందికదా! మనం ప్రజా ప్రభుత్వాన్ని కోరుతున్నాం. అంటే అర్థం, అందరికీ సమాన హక్కులు కావాలని కోరుతున్నాం. ఇట్టి ప్రజా ప్రభుత్వం యుగయుగాలనుంచే ప్రజల ఆశయం అవుతూ వచ్చింది. మానవ చరిత్రలో యిదొక ప్రధాన సూత్రం. భగవంతుని దృష్టిలో మనుష్యులందరూ స్వేచ్ఛగలవారు; సోదరులు; సమానులు. స్వాతంత్ర్యాన్ని ఎందు కభిలషిస్తున్నామంటే, దాని ద్వారానే వ్యక్తి సంపూర్ణంగా తన కర్తవ్యాన్ని నిర్వర్తించగలడు కాబట్టి. వ్యక్తియొక్క ఔన్నత్యానికీ, ప్రజా శ్రేయస్సుకీ, వ్యక్తి స్వాతంత్ర్యం అవసరం. బ్రిటిషు ప్రభుత్వానికి నేను చేసే హెచ్చరిక ఏమంటే, పౌరసత్వపు హక్కులనే దీపాన్ని ఒకసారి వెలిగిస్తే, ఎప్పుడూ అది వెలుగుతూనే ఉంటుంది. మనుష్య మాత్రులెవరూ దాన్ని ఆర్పలేరు. భూ మధ్యంలో ఉన్న అగ్నిగోళం మాదిరిగా అప్పుడప్పుడు చల్లారుతూ ఉండవచ్చును. మహాసముద్రాలు దాన్ని చుట్టూ ముట్టవచ్చును. పర్వతాలు దాన్ని కిందికి అణిచిపెట్ట వచ్చును. కాని, ఆ అగ్నిగోళంలో సప్త సముద్రాలనూ, భూమినీ, సర్వనాశనం గావించే శక్తి ఉంది. ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడో ఒకచోట, ఆ అగ్ని పర్వతం బ్రద్దలై ఆకాశంవరకూ వ్యాపించే అగ్నిజ్వాలలను ఎగయవేయగలదు. భారత కమ్యూనిస్టు పార్టి చిరస్థాయిగా వర్ధిల్లాలి. స్వేచ్ఛకొరకు, స్వాతంత్ర్యంకొరకు, పోరాడు కాంగ్రెసు ఆ పార్టికి నూతన జీవం పోయాలి. అది ఆవిధంగా చేయకపోతే, మీరందరూ లక్షలకొలదిగా కాంగ్రెసులోచేరి, కాంగ్రెసు కార్యక్రమాన్ని నేటికంటె అభివృద్ధికరంగా మార్చాలి."

తరువాత యీక్రింది తీర్మానం సభవారిచే ఏకగ్రీవంగా ఆమోదించబడింది:

"దేశస్వాతంత్ర్యం కొరకు కృషిచేసే ప్రతి సంస్థ మాదిరిగానే భారత కమ్యూనిస్టు పార్టి కూడా బహిరంగంగా ఉండి పనిచేయుటకు హక్కు కలిగియుండాలని కలకత్తా పౌరులమైన మేము విశ్వసిస్తున్నాము. ఇది ప్రజాప్రభుత్వంయొక్క ప్రధాన సూత్రాలలో ఒకటి అని మాఅభిప్రాయం. కాబట్టి, ఇండియా ప్రభుత్వంచే విధించబడిన కమ్యూనిస్టు పార్టిపై నిషేధాన్ని వెంటనే తొలగించవలసినదిగా ఈ సభవారు అడుగుచున్నారు."

* * *

### మద్రాసు

మద్రాసు 20-3-39 వ తేదీ సాయంకాలం హైకోర్టు సముద్రపు ఒడ్డున కామ్రేడ్ సోమేశ్వరరావుగారి అధ్యక్షతక్రింద, స్థానిక సామ్యవాద సంఘ, ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు సంయుక్త యాజమాన్యమున బహిరంగ సభ జరిగింది. వివిధ రాష్ట్రీయ కాంగ్రెసు మంత్రివర్గములవారందరూ ఐక్యకంఠంతో, కమ్యూనిస్టు పక్షంపైన నిషేధాజ్ఞను కేంద్రప్రభుత్వం వారు తొలగించేటట్లు నచ్చ జెప్పి తత్సంకల్ప సిద్ధికి సర్వశక్తులనూ ఉపయోగించాలనీ, పై బహిరంగసభవారు ఏకగ్రీవంగా తీర్మానించారు.

పై తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ శ్రీయుత ఏ. యస్. కే. అయ్యంగారు, అహింసాసూత్రంలో విశ్వాసం ఉన్న అనేక కాంగ్రెసువాదులు నిషిద్ధమైన కమ్యూనిస్టుపార్టీ సభ్యులై యున్నారనీ, సామ్యవాదం దేశమంతటా వ్యాప్తిచెందిన పరిస్థితులలో అహింసా విధానమును అతిసులభముగా ఆచరణపెట్టడానికి అవకాశాలున్నవనీ మీ రట్ కుట్ర కేసు వివరములను విస్పష్టపరచారు.

అటు తర్వాత పి. రామమూర్తిగారు తీర్మానాన్ని బలపరుస్తూ గంభీరోపన్యాసం గావించారు.

* * * *

### బారిసాల్

కమ్యూనిస్టుపార్టీపై నిషేధం తొలగించాలని ఆందోళన సల్పుటకు యీనెల 20 వ తేదీని బారిసాల్ (బెంగాల్) నగరంలో బ్రహ్మాండమైన ఊరేగింపు, బహిరంగ సభ జరిగెను. శ్రీ దేవేంద్రనాథ ఘోష్‌గారు సభకు అధ్యక్షత వహించారు. ఇండియాలో బ్రిటిషు ప్రభుత్వం అవలంబిస్తున్న ద్రోపిడీ విధానాన్ని గురించి బీరేన్‌దాస్ గుప్తా, సురేశ గంగూలీ, అమియకుమార్‌దాస్ గుప్తా, మొదలైనవారు ఉపన్యసించారు. కాంగ్రెస్ నాయకులు నేడు అవలంబిస్తున్న ద్రోహ విధానాన్ని అరికట్టి, స్వాతంత్ర పోరాటాన్ని అభివృద్ధి పరచాలంటే, దేశంలో ఉన్న అతివాద ముఠాలన్నీ ఒక నిర్దిష్ట కార్యక్రమంమీద కలిసి పనిచేయాలని ఉపన్యాసకులు తెలియజేశారు.

భారత కమ్యూనిస్టుపార్టీని బ్రిటిషుసామ్రాజ్యవాద ప్రభుత్వం నిషేధించి, ప్రజాసామాన్యం సల్పుతూన్న స్వాతంత్ర్య పోరాటాన్ని భగ్నం చేయ ప్రయత్నిస్తూన్నందుకు తీవ్రంగా ఖండిస్తూ, ఆపార్టీమీద నిషేధించబడిన యితర రాజకీయ సంస్థలమీద, నిషేధాన్ని తొలగించవలసిందిగా ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ తీర్మానించబడింది. కాంగ్రెసు మంత్రులు అధికారములోఉన్న వివిధరాష్ట్రాలలో రాష్ట్రపార్టీలమీద నిషేధాన్ని తొలగించి స్వరాజ్య పోరాటాన్ని అభివృద్ధి పరచవలసినదిగా కోరుచూ మరొక తీర్మానం ఆమోదించబడెను.

* * *

### బెల్గాం

ఇదే విధంగా బెల్గాం (మహారాష్ట్రం)లో కూడా 20 వ తేదీని మారుతీ దేవాలయంలో జరిగిన బహిరంగసభలో చాలామంది కాంగ్రెసువాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని తొలగించవలసినవని హెచ్చరిస్తూ ఉపన్యాసాలు గావించారు.

* * *

### తిరుచినాపల్లి

జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ యాజమాన్యాన్ని తిరుచినాపల్లిలో టవున్ హాలు యెదుట జరిగిన బహిరంగసభలో కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని తొలగించమని మద్రాసు ప్రభుత్వాన్ని కోరుచూ తీర్మానించబడింది. ఏ.సి. కృష్ణస్వామిగారు సభకు అధ్యక్షత వహించారు.

* * *

### క్యాలికట్

శ్రీయుత టి. వి. శివదాసుగారు 20-3-39 వ తేదీ సాయంకాలం కాలికట్ సముద్రతీరాన్ని జరిగిన బహిరంగ సభకు అధ్యక్షత వహించారు. టి. రామన్‌కుట్టినాయర్ ఇంబిచి బావా మొదలైన వారు, కమ్యూనిస్టులు భారతదేశ స్వాతంత్ర్య పోరాటానికి ఏవిధంగా తోడ్పడుతున్నారో వివరిస్తూ ఉపన్యసించారు. భారత కమ్యూనిస్టుపార్టీ మీద నిషేధంతొలిగిస్తే స్వరాజ్యపోరాటానికి ఎంత లాభకరమో విశదీకరించారు. ఆపార్టీపై నిషేధం తొలగించమని కోరుతూ తీర్మానం సభలో ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

* * *

### ఇరాసిపురం

20-3-39 వ తేదీని ముత్యాలు స్వామినాయుడుగారి అధ్యక్షతక్రింద కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఏర్పాటుచేసిన బహిరంగ సమావేశంలో కమ్యూనిస్టుపార్టీ పై నిషేధాన్ని తొలగించవలసిందని కోరుతూ తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరించబడింది.

* * * *

### తిరుత్తరైపూండి

తిరుత్తరైపూండి కార్మిక సంఘంయొక్క సమావేశం 20 వ తేదీని జగన్నాథ దేవర్ అధ్యక్షతక్రింద జరిగి, కమ్యూనిస్టుపార్టీ పై నిషేధాన్నితొలగించవలసినదిగా తీర్మానించింది.

# కమ్యూనిస్టు పార్టీపై నిషేధము తొలగించాలి.

## కాంగ్రెసు మంత్రివర్గాలు అందుకై కృషి చేయాలని ఆంధ్ర దేశములో సభలు.

### కమ్యూనిస్టు పార్టీ

ఈ నెల 20వ తేదీని బెజవాడలో నగర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ యాజమాన్యాన సాయంత్రం 6-30 గంటలకు గాంధీపార్కులో జరిగిన బహిరంగ సభకు కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యగారు అధ్యక్షత వహించారు.

మొదట కామ్రేడ్ జొన్నలగడ్డ రామలింగయ్యగారు కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని తొలగించవలసిన ఆవశ్యకతను గురించి తెల్పుతూ, కమ్యూనిస్టులు దేశమందంతటా బ్రిటిషు ప్రభుత్వంచే ఏ విధముగా అనేక రకముల హింసించబడుతున్నారో చెప్పారు. ఇతర రాజకీయ పార్టీల మాదిరిగానే కమ్యూనిస్టులుకూడ తమ పార్టీని యేర్పరచుకొని, తమ అభిప్రాయాలను ప్రజలకు తెలియజేసుకోనే హక్కు ఉండాలి అని ఉపన్యసించారు.

తరువాత చండి జగన్నాథంగారు మాట్లాడుతూ, కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక ప్రకారం కాంగ్రెసు మంత్రులు కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించి పౌరసత్వపు హక్కులను కాపాడవలసినదని కోరారు.

ఆంధ్రరాష్ట్ర రైతు సంఘ కార్యదర్శి చలసాని వాసుదేవరావుగారు కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని తొలగించేటట్లు మద్రాసు ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వము మీద ఒత్తిడి తేవలసిందనే తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ, యీ విధంగా ఉపన్యసించారు. బ్రిటిషు ప్రభుత్వము ప్రజల సాధారణ పౌరసత్వపు హక్కులను, అనగా వాక్సభా పత్రికా స్వాతంత్ర్యమును హరిస్తున్నది. భారత దేశ పారిశ్రామిక వర్గముయొక్క ఏకైక పార్టీ అయిన కమ్యూనిస్టు పార్టీ బ్రిటిషు ప్రభుత్వంచే దోపిడీ చేయబడుతున్న పీడిత ప్రజా సామాన్యముయొక్క హక్కులకై ఎడతెగని పోరాటము సల్పుతోంది. కాబట్టి, స్వాతంత్ర్యాన్ని కోరే ప్రతి భారతీయుడు ఆ పార్టీపై గల నిషేధాన్ని తొలగించేటట్లు ఆందోళన చేయవలసియున్నది.

కె. యల్. నరసింహంగారు పైతీర్మానాన్ని బలపరుస్తూ ఉపన్యసించారు.

తరువాత కామ్రేడ్ సుందరయ్యగారు తమ అంత్యోపన్యాసంలో గత 15 సంవత్సరములనుంచీ భారతదేశంలో కమ్యూనిస్టులే విధంగా కార్మిక, కర్షకుల ప్రజా పోరాటంలో పాల్గొనినదీ వివరించారు. సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో నేడు వారే విధంగా ముందడుగు వేస్తున్నదీ తెలియజేశారు. కమ్యూనిస్టు పార్టీని యింగ్లాండు—ఫ్రాన్సు—అమెరికా మొదలయిన దేశాలలో నిషేధించనప్పుడు ఇండియాలో మాత్రం ఎందుకు నిషేధించాలని ప్రశ్నించారు. దేశంలో కమ్యూనిస్టుల్ని గురించి ప్రజలలో దురభిప్రాయాలు కలుగజేసే మద్రాసు ప్రభుత్వ ప్రకటనను సుందరయ్యగారు విమర్శించారు. నిషేధం తొలగిస్తే ప్రజా శ్రేయస్సుకి భంగకరం అని చెప్పిన బొంబాయి కాంగ్రెసు మంత్రుల ధోరణి కాంగ్రెసు సిద్ధాంతాలకు వ్యతిరేకం అని చెప్పారు. కరాచీ కాంగ్రెసులో ప్యాసైన ప్రాథమిక హక్కుల తీర్మానాన్ని, కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికను కాంగ్రెసు మంత్రులు ఆచరణలో పెట్టి, కమ్యూనిస్టు పార్టీపై గల నిషేధాన్ని తొలగించడానికి కేంద్ర ప్రభుత్వానికి సిఫార్సు చేయవలసినదిగా హెచ్చరించారు.

తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

### రెండవ సభ.

బెజవాడ ప్రెస్‌వర్కర్సుయూనియన్‌యొక్క, గవర్నరుపేట కార్మిక సంఘంయొక్క యాజమాన్యాన 23-3-39 వ తేదీని అన్సారీ-పార్కులో జరిగిన బహిరంగసభకు తిలక్‌నగర డివిజనల్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులైన శ్రీ కుందేరు సత్యనారాయణగారు, బి. యే., బి. యల్., అధ్యక్షత వహించారు. కామ్రేడ్స్ కె. యల్. నరసింహంగారు, నండూరి ప్రసాదరావుగారు, పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు ఉపన్యసించాక యీ క్రింది తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

"పీడిత శ్రామికవర్గం యొక్క రాజకీయపార్టీ అయిన భారత కమ్యూనిస్టు పార్టీని కేంద్రప్రభుత్వం నిషేధించి, ప్రజల పౌరసత్వపు హక్కులను భంగపరచుచున్నందుకు యీ సభవారు కేంద్ర ప్రభుత్వ చర్యను నిరసించుచూ, స్వాతంత్ర్య పోరాటాభివృద్ధికి అత్యవసరమైన పౌరసత్వపు హక్కులను కాంగ్రెసు మంత్రివర్గాలు అభివృద్ధి పరచాలనీ, అందుకై కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని తొలగించుటకు కేంద్ర ప్రభుత్వంమీద ఒత్తిడి తీసుకురావాలని యీ సభవారు కోరుచున్నారు."

* * *

### బిట్రగుంట

యం. యస్. యం. రైల్వే యూనియన్ యాజమాన్యాన్ని 20-3-39 వ తేదీని సాయంకాలం బిట్రగుంటలో కామ్రేడ్ పి. సుబ్బరామయ్యగారి అధ్యక్షత క్రింద జరిగిన బహిరంగసభలో కామ్రేడ్స్ పి. గోవిందరాజులు, ఎ. వి. కృష్ణయ్య, యం. వెంకయ్యగారలు కమ్యూనిస్టుపార్టీపై నిషేధాన్ని తొలగించవలసిన అవసరాన్ని గురించి ఉపన్యసించాక, ఈ క్రింది తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

"అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకులైన దత్తు-బాడ్లీల థీసిస్ ప్రకారం "భారతదేశంలో కాంగ్రెస్ సంస్థయొక్క నాయకత్వాన్ని యిదివరకే సమకూరిన జాతీయమైక్యతను ఇంకా పెంపొందించుట, భారత కమ్యూనిస్టుల దృక్పధంలో వెంటనే మనం నెరవేర్చవలసిన కర్తవ్యం; భారతీయుల స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొంటూ ప్రజాస్వామ్య పరిపాలనను స్థాపించుట, బ్రిటిష్‌సామ్రాజ్యవాదంతో పోరాటం సల్పే భారతీయుల ఏకైక ప్రజాసంస్థ కాంగ్రెసు కాబట్టి దానిలో మనం ఒకపోరాటశక్తిగా పనిచేయుట" దీనినిబట్టి కమ్యూనిస్టులు కాంగ్రెసు కార్యక్రమానికి వ్యతిరేకంగా పనిచేయరు. కనుక, 1934 జూలైలో కమ్యూనిస్టుపార్టీమీద విధించబడిన నిషేధాజ్ఞను మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వం వెంటనే తొలగించవలసిందని యీ సభవారు ప్రార్థిస్తున్నారు."

### ఏలూరు

భారత కమ్యూనిస్టుపార్టీపై గల నిషేధాన్ని తొలగించవలసిందని కోరుటకై ఏలూరు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీయొక్క, ప్రెస్‌వర్కర్సు యూనియన్‌యొక్క యాజమాన్యాన్ని 20 వ తేదీ సాయంకాలం హిందూ యువజన సంఘమందు బహిరంగ సభ జరిగెను. కామ్రేడ్ గారపాటి సత్యనారాయణగారు అధ్యక్షత వహించారు.

శ్రీ బనిశెట్టి అప్పారావు, శ్రీ లేడి అప్పలస్వామి, మొదలగువారు కమ్యూనిస్టుపార్టీపై నిషేధం తొలగించకుండా యుండుటవల్ల మద్రాసు మంత్రివర్గంవారు తమ కర్తవ్యాన్ని మరచుచున్నారని ఉపన్యసించారు. కమ్యూనిస్టుపార్టీపై నిషేధాన్ని తొలగించవలసినదను తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

* * *

### కాకినాడ

20-3-39 వ తేదీ సాయంకాలం కామ్రేడ్ సి. వి. కె. రావుగారి అధ్యక్షతక్రింద కాకినాడ, జగన్నాథపురంలో బహిరంగసభ జరిగెను. కామ్రేడ్స్ కొరపాటి పట్టాభిరామయ్య, డాక్టరు యం. వి. వీరయ్యగారలు దేశంలో కమ్యూనిస్టులు చేస్తున్న త్యాగాన్ని, స్వాతంత్ర్యపోరాటంలో వారు చేస్తున్న కృషినీ, కొనియాడుతూ ఉపన్యసించారు. ఇండియాలో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించవలెనను తీర్మానం ఆమోదించబడింది.

సభకు అనేక వందలమంది కార్మికులు హాజరయారు. ఉదయం ఎర్రజండాలతో కార్మికసంఘసభ్యులనేకమంది గొప్ప ఊరేగింపు జరిపారు.

* * *

### యలమర్రు

20-3-39 వ తేదీని యలమర్రులో గ్రామ కాంగ్రెసు—యువజన—సోషలిస్టు—రైతు సంఘముల యాజమాన్యాన జరిగిన బహిరంగ సభకు శ్రీ యడ్పుగంటి కూర్మారావుగారు అధ్యక్షత వహించగా యీ క్రింది తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

"వాక్స్వాతంత్రము, సభా స్వాతంత్రము, ముద్రణా స్వాతంత్రము కావలెనని 52 సంవత్సరములనుండి పోరాడుచున్న కాంగ్రెసు సంస్థ తరపున నేడు మంత్రులు అధికారంలో ఉన్నను, ప్రజా పక్షమున్నూ—కార్మిక, కర్షక శ్రేయస్సున్నూ అభిలషించు కమ్యూనిస్టు పార్టీపై నిషేధము తొలగింపకుండుట కడు గర్హ్యనీయము కాబట్టి వెంటనే తొలగించవలసినదిగా యీ సభవారు తీర్మానించుచున్నారు."

* * *

### ఇతర ప్రదేశాలు

20-3-39 వ తేదీని వాసిలి గ్రామ రైతు సంఘ యాజమాన్యాన జరిగిన బహిరంగ సభలోను, శాకమూరి లింగయ్యగారి అధ్యక్షత క్రింద సమావేశమైన చినపాలెం గ్రామ కాంగ్రెసు సంఘ సాధారణ సమావేశంలోను, 22 వ తేదీని శ్రీ అల్లూరి కోదండరామిరెడ్డిగారి అధ్యక్షత క్రింద సమావేశమయిన తాటిపర్తి (నెల్లూరు జిల్లా) గ్రామ కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ సమావేశంలోను, కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని తొలగించవలసిందని మద్రాసు ప్రభుత్వాన్ని కోరుతూ, తీర్మానించబడెను.



# కాళీపట్నములో అరెస్టులు ఇంకను సాగుతున్నాయి.

## రాష్ట్రమంతా పోలీసు దురంతాలసు ఖండిస్తూ సభలు జరుగుతున్నాయి.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ అధ్యక్షునియొక్క, మద్రాసు ప్రధాని రాజాజీయొక్క సలహాపై యీనెల 12 వ తేదీని కాళీపట్నం, పాతపాడు గ్రామాలలో రైతుల సత్యాగ్రహం విరమించబడినట్లు పాఠకులకు తెలిసియే ఉంటుంది. రివెన్యూ మంత్రి ప్రకాశం పంతులుగారు కూడా త్రిపురీ కాంగ్రెసు జరిగిన వెంటనే కాళీపట్నం, పాతపాడు గ్రామాలకు వెళ్లి, ఉన్న విషయాలన్నీ తెలుసుకొన్నారు. పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెస్ కమిటీవారు శ్రీ దండు నారాయణరాజు, ఎం. యల్. ఏ. గారినీ, శ్రీ ముదుగంటి జగ్గన్నశాస్త్రి, టి. పేరరాజు, కె. సూర్యనారాయణ గారలనూ విచారణ కర్తలుగా నియమించారు.

ఇట్టి పరిస్థితులలో సబ్ డివిజనల్ మేజిస్ట్రేటుగారిచే సెక్షన్ 107 క్రిమినల్ ప్రొసీజరు కోడ్ ప్రకారం జారీచేయబడిన నోటీసులు 22—3—39 వ తేదీని ఈ క్రిందివారిపై అమలు జరుపబడ్డాయి.

1. ఉద్దరాజు రామం-వాలమర్రు
2. తటికెళ్ళ వెంకటచలపతి-భీమవరం
3. కృత్తివెంటి వెంకటేశ్వర్రావు-భీమవరం
4. ఓదిలిశెట్టి మాణిక్యాలరావు-విస్సాకోడేరు.
5. నెక్కలపు రామారావు-ఆచంట
6. వేరేప మృత్యుంజయుడు-ఆచంట

నోటీసులో యీ క్రిందివిధంగా వ్రాయబడి ఉంది.

"రెస్పాండెంట్లకు లా-ఆర్డర్లంటే గౌరవం లేదు. ఎట్టిపని లేకుండా ఎల్లప్పుడూ తిరుగుతూ ఉంటారు. కాళీపట్నం, పాతపాడు గ్రామాలతో గాని, ఆ గ్రామస్థులతోగాని, వారికెట్టి సంబంధమూ లేదు. కాళీపట్నం జమీందారుకూ-కాళీపట్నం, పాతపాడుగ్రామస్థులకూ మధ్య ప్రాజెక్టుభూముల హక్కునుగురించి తగాదాలున్నాయి. అవి జమీందారువేనని నిర్ణయించబడింది. ఈ సందర్భంలోనే సెక్షన్ 144 క్రి. ప్రొ. కోడ్ నర్సాపురం స్టేషనరీ సబ్‌మేజస్ట్రేటుగారిచే జారీచేయబడి, నేడు అమలులో ఉంది. దొమ్మీలు, యితర దౌర్జన్యాలు రైతులు చేయునట్లు ప్రోత్సహించడానికి ఉద్దేశపూర్వకంగా రెస్పాండెంట్లు పై గ్రామాలకు తరచు వెళ్తుతూ, ఆవిధంగా శాంతిభంగ పరుస్తున్నారు. గవర్నమెంటు ఉద్యోగస్థులూ, జమీందారు నౌకర్లూ, ప్రయాణంచేసే పడవలను ముంచివేయవలసిందని వారు గ్రామస్థుల్ని రెచ్చగొట్టారు. ప్రాజెక్టు భూముల్ని జమీందారు మనుష్యులు కొలవకుండా గ్రామస్థులు ఆటంకపరిచేటట్లుకూడా చేస్తున్నారు. గ్రామస్థులు న్యాయవిరుద్ధంగా భూముల్నాక్రమించుకొనేటట్లు ప్రోత్సాహపరుస్తున్నారు. జమీందారుగారిచే నియమించబడిన వ్యక్తుల్ని కొట్టమని కూడా చెప్పుతూ వచ్చారు.

"9-3-39 వ తేదీని రెస్పాండెంట్లు పై గ్రామాలకువెళ్ళి, గ్రామస్థుల్ని అక్రమ సంఘముగా తయారుచేసి, ప్రాజెక్టుభూముల్ని జమీందారు మనుష్యులు కొలవకుండా ఆటంకపరిచారు. ఈ ప్రమాదం రాకుండా చేయడానికి గ్రామస్థుల్ని ఎరెస్టు చేయవలసి వచ్చింది. ఇప్పటికీ రెస్పాండెంట్లు శాంతికి భంగం కలిగించేటట్లు రైతుల్ని రెచ్చగొట్టుతున్నారు.

"మీ ఆరుగురు రెస్పాండెంట్లు యికముందు కూడా శాంతికి భంగం కలిగించే పనులు చేస్తారనీ, మీ ప్రోద్బలంవల్లను, తప్పుడు పనులవల్లను ప్రజాశాంతికి భంగం కలిగే పరిస్థితులు ఏర్పడవచ్చుననీ, నాకు తెలిసింది కాబట్టి సెక్షన్ 107 క్రి. ప్రొ. కోడ్ ప్రకారం మీమీద చర్య తీసుకొనడానికి తగిన ఆధారాలున్నవి. కాబట్టి మీరందరూ ఒక సంవత్సరం వరకూ శాంతికి భంగం కలుగకుండా ఉండడానికి ఒక్కొక్కరు 500 రూపాయల చొప్పున పూచీకత్తులు వ్రాసి యిచ్చి, ఒక్కొక్కరికి యిద్దరు అంతంత మొత్తాలకే జామీనుబాండులు యివ్వవలసిందని ఉత్తరువు యిచ్చుచున్నాను.

(సం.) సబ్‌డివిజనల్ మేజస్ట్రేటు"

కామ్రేడ్స్ కృత్తివెంటి వెంకటేశ్వరరావు, తటికెళ్ల వెంకట చలపతి గార్లపై కేసు 23-3-39 వ తేదీని నర్సాపురం ఫస్టుక్లాసు మేజస్ట్రేటుగారిపద్ద విచారణ ప్రారంభమయింది. ఏప్రిల్ 1 వ తేదీకి వాయిదావేశారు.

ఇదివరలో 107 వ సెక్షన్ క్రింద ఎరస్టు చేయబడిన కామ్రేడ్ భూపతిరాజు లక్ష్మీనరసరాజుగారినీ, సంకు అప్పారావుగారినీ, 23 వ తేదీని తణుకునుంచి నర్సాపురం తీసుకువచ్చి, కేసు విచారణ ప్రారంభించారు.

#### లక్ష్మీనరసరాజుగారి స్టేట్‌మెంటు

కోర్టులో కామ్రేడ్ లక్ష్మీనరసరాజుగారు యీక్రింది స్టేట్‌మెంటు యిచ్చారు:

"నేను కాంగ్రెసు సోషలిస్టును. పశ్చిమ గోదావరి జిల్లా రైతు సంఘాధ్యక్షుడను. కాళీపట్నం రైతులకు-జమీందారుకు మధ్య జరుగుచున్న తగాదాలను విచారణ చేయుటకు కాళీపట్నం వెళ్ళియుంటిని. పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు, కొందరు పోలీసులు మీరిచ్చటకు వచ్చుటకు వీలులేదని చెప్పిరి. అంతట నేను విచారణ చేయుటకు వచ్చితినిగాన విచారణచేసి వెళ్లెదనని చెప్పితిని. కొంతదూరం, అనగా 2 ఫర్లాంగులదూరం, వెళ్ళిన తరువాత చప్పట్లు కొట్టి, పిలిచి ఎరస్టుచేసిరి. ప్రజలను రెచ్చగొట్టి అశాంతిని నెలకొల్పుటకు నేను వెళ్ళియుండలేదు. జామీను యివ్వను."

#### అప్పారావుగారి స్టేటుమెంటు.

కామ్రేడ్ సంకు అప్పారావుగారు కూడా కోర్టులో యీ క్రింది స్టేట్‌మెంటు యిచ్చారు:

"నేను భీమవరం తాలూకా కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ కార్యదర్శిని. జిల్లారైతు సంఘాధ్యక్షులైన భూపతిరాజు లక్ష్మీ నరసరాజుగారు విచారణచేయుటకు వెళ్లుచుండగా, వారికి సహాయార్థం నేను వెళ్లితిని. కాళీపట్టణ ప్రాజెక్టులో డి. ఎ. యస్. పి. గారు, కొంత రిజర్వుదళం ఉండగా, మేము విచారణ చేయుటకు రెండు ఫర్లాంగులు వెళ్లినప్పటికి వెనుకకు పిలిచి ఎరస్టుచేసిరి. ఆ రోజున భోజనం పెట్టలేదు. నేను జామీను యివ్వను"

కేసు 30 వ తేదీకి వాయిదా వేయబడెను.

#### తాలూకా కాంగ్రెస్ కమిటీ తీర్మానము.

20-3-39 వ తేదీని నర్సాపురం తాలూకా కాంగ్రెస్ సంఘ సాధారణ సమావేశము నర్సాపురంలో, వోసూరి నరసింహమూర్తిగారి అధ్యక్షతను సమావేశమై కాళీపట్నంలో జరిగిన లాఠీచార్జి, అరెస్టులు జండాను అవమానపరచుట మొదలైన పోలీసు అధికారుల చర్యలను ఖండించుచూ, యీ దిగువ తీర్మానాలు ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

1. కాళీపట్నంలో రైతులకు జమీందారుకు మధ్య జరుగుచున్న భూమి పొజిషను హక్కు తగాయిదాను గురించిన్ని దరిమెలా జరిగిన అరెస్టులు, లాఠీచార్జీలు వగైరా పోలీసు దురంతముల గురించిన్ని కాళీపట్నం ఉపసంఘమువారు తయారుచేసిన రిపోర్టును ఆమోదించుచూ తీర్మానించడమైనది.

2. శాంతముగానున్న రైతులపై తీవ్రమైన లాఠీచార్జి చేయుటయేగాక స్త్రీలను వృద్ధులను నిర్దాక్షిణ్యముగా కొట్టి జాతీయ జండాను అవమాన పరచిన పోలీసు ఉద్యోగుల చర్యలను ఖండించుచూ అట్టి ఉద్యోగుల చర్యలను విచారించి తగినచర్య గైకొనవలసినదిగా మద్రాసు ప్రభుత్వమువారిని యీసభవారు కోరుచున్నారు.

3. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారి ఉత్తరము ననుసరించియు, మదరాసు ప్రధానిగారి తంతి ననుసరించియు, రైతులు సత్యాగ్రహమును విరమించి కాంగ్రెసుపట్ల చూపిన భక్తి విశ్వాసముల కీసంఘమువారు సంతసించుచూ, మద్రాసు ప్రభుత్వమువారు సత్యాగ్రహ సందర్భమున శిక్షింపబడిన ఖైదీలను వెంటనే విడుదల చేయవలెననియూ, యింతవరకూ నడపుతూన్న కేసులను ఉపసంహరించుకొనవలెననియు, 144, 107 సెక్షనులు రద్దుపరచుకొనవలెననియు, రైతులకు భూమిపైగల హక్కులను స్థిరపరచవలెననియు, యీసంఘమువారు కోరుచున్నారు.

* * *

### సానుభూతి సభలు.

13-3-39 వ తేదీని నెలమూరుగ్రామములో శ్రీ కుచ్చర్లపాడి నారాయణరాజుగారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో ఈ క్రింది తీర్మానం ఒకగ్రీవంగా ఆమోదించబడింది.

కాళీపట్నంలో రైతులు తమ న్యాయమైన హక్కులకై సుమారు 6 మాసములనుంచి చేయుచున్న పోరాటమును, నేడుకాళీపట్నంలో జరుగుచున్న సత్యాగ్రహమును యీ సభవారు అభినందించుచున్నారు. రైతులపై జమీందారు అన్యాయంగా కేసులు పెట్టించి, గవర్నమెంటు సహాయంతో రైతులను, రైతుసేవకులను అరెస్టుచేయుటను లాఠీచార్జీచేసినపోలీసువారిని యీ సభవారు నిరసించుచూ, రైతులకు సహాయం చేయవలసినదిగా కాంగ్రెసు మంత్రివర్గం వారికిన్నీ, ఆంధ్రరాష్ట్ర రైతు సంఘంవారికిన్నీ, రాష్ట్రీ కాంగ్రెసు సంఘము వారికిన్నీ, విజ్ఞప్తి చేయడమైనది."

#### పాలూరు.

తణుకు తాలూకా, పాలూరు గ్రామకాంగ్రెసు సంఘ యాజమాన్యమున జరిగిన బహిరంగ సభలోకూడా కాళీపట్నం రైతుల్ని అభినందిస్తూ రైతుల న్యాయమైన హక్కును కాపాడవలసినదని కాంగ్రెసు మంత్రివర్గాన్ని హెచ్చరిస్తూ తీర్మానించబడింది.

#### మట్లపాలెం.

నర్సాపురం తాలూకా, మట్లపాలెంలో 19-3-39 వ తేదీని జరిగిన గ్రామకాంగ్రెసు మహాసభలో శాంతియుతంగా సత్యాగ్రహము చేయుచున్న రైతులు, స్త్రీలు, బాలురు, వృద్ధులు అనే వివక్షతలేకుండా ఘోరంగా లాఠీలతో కొట్టి, బూటుకాళ్ళతో తన్నిన పోలీసువారి చర్యలను ఖండిస్తూ తీర్మానంగావించబడెను. ఎరస్టు కాబడిన సత్యాగ్రహ ఖైదీలను తక్షణమే విడుదల చేసి, మిగిలినవారిమీది కేసులను ఉపసంహరించుకొనవలసిందిగా మద్రాసు ప్రభుత్వమును కోరుచూ మరొక తీర్మానం ఆమోదించబడింది.

#### యలమర్రు

కృష్ణాజిల్లా, యలమర్రు గ్రామంలో 20-3-39 వ తేదీని గ్రామకాంగ్రెసు, యువజన సోషలిస్టు, రైతు సంఘముల యాజమాన్యమున జరిగిన బహిరంగసభకు శ్రీ యడ్పుగంటి కూర్మారావుగారు అధ్యక్షత వహించారు. కాళీపట్నంలో జమీందారుగారు యిదివరకు రైతులతో చేసుకున్న ఒడంబడిక షరతులను భగ్నపరచి, రైతుల కన్యాయం గావించుచున్న విషయమును కాంగ్రెసు ప్రభుత్వం వెంటనే విచారించి, రైతులకు మేలొనరించవలసినదిగా మదరాసు ప్రభుత్వాన్ని కోరుచూ సభలో తీర్మానించబడెను.

* * *

ది 19-3-39 తా॥ తాడేపల్లి గూడెములో ప. గోదావరి జిల్లా కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘము శ్రీయుత దండు నారాయణరాజుగారి అధ్యక్షత క్రింద సమావేశమై కాళీపట్టణము విషయమై యీదిగువ తీర్మానమునుగావించెను.

#### తీర్మానము

"కాళీపట్టణ జమీందారు రైతుల మధ్యగల వివాద విషయములలో యింతటనుంచి జిల్లా కాంగ్రెసు కమిటీ బాధ్యత వహించుటకును, సదరు తగాదా విషయములను విచారించి యావత్తు అవసరచర్య తీసుకొనుటకును ప్రస్తుతమున్న కేసులలో డిఫెన్సుపెట్టి నడిపించుటకును యీదిగువ వారిని ఉపసంఘముగా నియమించుటకును తీర్మానించడమయినది.

ఉపసంఘ సభ్యులు— 1. దం. నారాయణరాజు యం. యల్. ఏ. 2. ము. జగ్గన్నశాస్త్రి కార్యదర్శి, ప. గో. జి. కాం. సం. 3. కొ. సూర్యనారాయణ స. కార్యదర్శి, ప. గో. సం. 4. పోడూరి పేరరాజు.

ఈ ఉపసంఘంవారు అవసరం వెంబడిని యితరులను కూడ చేర్చుకొనుటకు అధికారమివ్వడమయినది. ఈసంఘమునకు కన్వీనరుగా దం. నారాయణరాజుగారిని ఏర్పర్చడమయినది.

# భూములపై హక్కు కాళీపట్టణపు రైతులదే.

రివిన్యూ మంత్రిగారికి శ్రీ దండు నారాయణరాజు, శ్రీ గొట్టుముక్కల వెంకన్న (శాసన సభా సభ్యులు) పంపిన మెమోరాండము

ఘనమైన అయ్యా,

మీరు 13—3—39 తేదీ దయతో స్వయంగా కాళీపట్నం గ్రామానికివిచ్చేసి గ్రామస్థులనుండియే తగవును గురించి తెలిసికొనియున్నారు. మేము ఉభయ పార్టీలను విచారించి యీ క్రింది విషయాలనుకూడ మీ సన్నిధానికి దాఖలు చేసికొంటున్నాము.

2. 1772 సంవత్సరము ప్రాంతాల మొగల్‌తుర్రు రాజాగారు కాళీపట్నం గ్రామాన్ని ఆ గ్రామ సత్రవకు మొఖాసాగా దానంజేసి, ప్రస్తుత కాళీపట్న జమీందారు గారి కుటుంబాన్ని దానికి ధర్మకర్తగా నియమించి వుండిరి. 1813 సంవత్సరము జనవరి 15 వ తేదీ లేక ఆ ప్రాంతాన, మద్రాస్ ఫోర్ట్‌సెంట్ జార్జీ గవర్నరు గారు ప్రకటించిన సనద్‌లో "ఆ సత్రవలోనికి వచ్చు ప్రయాణీకుల సౌకర్యార్థం కాళీపట్నం గ్రామంనుండి వచ్చు యేడాదికి 236 కరకు వరహాలు లేక 260 పూల వరహాలు ఆదాయాన్ని ఏ విధమయిన పన్నులులేకుండా యిచ్చివేస్తూ" మొఖాసా మంజూరు చేసారు. ఆ సనద్‌లో "నియమింపబడిన విధులు నెరవేర్చకపోయినను లేక కుటుంబము నశించిపోయినను గ్రామము కంపెనీ వారికే చెందును" అని స్పష్టపరచబడింది. కాని కొంత కాలానికి జమీందారి పలుకుబడివలన ఆస్థియొక్క యాజమాన్య స్వభావము అతనికి అనుకూలముగా మారిపోయిందని రైతులు చెబుతున్నారు. 28-2-34 తేదీ ప్రకటించిన నెంబరు 5221 జి. ఓ.లో ప్రభుత్వం సేవ చేసినందుకుగాను, మొఖాసా యివ్వబడిందనీ సత్రవను సరిగా నడుపకపోయినా లేక కుటుంబము నాశనమయినా ప్రభుత్వము పన్ను మాత్రం వేయగలదు అనియు, జమీందారు కంట్రాక్టు అన్యాక్రాంతముకూడ చేయు హక్కులను కలిగివున్నాడనియు చెప్పిన రివిన్యూ బోర్డు సలహాను అంగీకరించింది.

3. సత్రవ ఉపయోగార్థము యివ్వబడిన యీనాం విస్తీర్ణము మొగల్తుర్రు రాజాగారి సనద్ ప్రకారమూ ఫోర్ట్‌సెంట్ జార్జి గవర్నరుగారి సనద్ (15-1-1813) ప్రకారముకూడా—900 ఎకరములు మాత్రమే. అందుచే 1860 లో యినామ్ కమీషనరు 900 ఎకరాలకు మాత్రమే పట్టా యిచ్చాడు. కాని 1902 లో గ్రామము సర్వేచేయబడి గ్రామ ఆయకట్టు మొత్తము 7500 ఎకరాలు అనీ అందు 900 ఎకరాలు మాత్రమే ఆక్రమణలో వున్న మెరక భూమి. 1000 ఎకరాలు ఉప్పు కాలువలు, 1500 ఎకరాలు అడవి, 4000 ఎకరాలు బంజరు పుస్తకాలలో నమోదు చేయబడింది. ఇపుడు కాళీపట్నం జమీందారు మొత్తము 7500 ఎకరాలూ తన ఎస్టేటు అని వాదించుతున్నాడు. రైతులు జమీందారు తన పలుకుబడి, డబ్బుద్వారా తన హక్కును విస్తరింప జేసికొనుటే గాక భూమి విస్తీర్ణము కూడా హెచ్చించుకొంటున్నాడని తెలుపుతున్నారు.

4. కాళీపట్నం జమీందారు. అతని కౌలుదారు ఎ. వెంకటరామన్ బార్. ఎట్. లా. గార్లు 1925 సప్టెంబరులో, కాళీపట్నము మొఖాసాకు జెందిన భూమిని తమకు, గ్రామములో అణచివేయబడిన వర్గాలకు సహాయార్థము రెండవపంట సాగులోజేర్చవలసిందని ప్రభుత్వాన్ని కోరారు, లేబరు కమీషనరుకు 5-5-1928 తేదీ పంపిన పిటీషను దీనితో పంపబడుతూంది. (అనువాదం యీ పత్రికలోనే ప్రకటించాము. సం.) దానిలో 9, 10 పేరాలు చూచిన జమీందారు రైతులకు, అధికారులకు తెలిపిన అంశాలు స్పష్టపడతాయి. జమీందారు అడవి, బంజరు భూములు సాగులోనికి తెస్తాననీ, గ్రామస్థులు తమ స్వాధీనములో వున్న భూమిని చేపలు పట్టుటపై ఆధారపడుకంటే న్యాయమైనపన్ను—తానుపడ్డ కష్టము ఖర్చులకై—చెల్లించి సాగుచేసికోవచ్చునని రైతులకు ఆశ జూపాడు. రైతులు జమీందారు తన వాగ్దానాన్ని సత్రములో వున్న విజిటర్ల పుస్తకములో నమోదుకూడ చేసాడని చెబుతున్నారు. అమాయక రైతులు ఆ పుస్తకాన్ని పవిత్రమైనదిగా కూడ ఎంచుతున్నారు. చివరకు 1934 లో ప్రభుత్వము ప్రాజెక్టుకు అనుమతించింది. కాలవలు త్రవ్వడము, అవసరమైన యిర్రిగేషన్ నిర్మాణాలు కూడ యిప్పటికి పూర్తిఅయినవి. కాళీపట్నం ప్రాజెక్టు అని పిలువబడే దీని క్రింద కాళీపట్నము గ్రామములోని 3820 ఎకరాలకు. పరిసర గవర్నమెంటు గ్రామాలకు జెందిన 800 ఎకరాలకు నీళ్లసప్లయి చేయబడుతూంది. ప్రాజెక్టు ఖర్చంతా మొదట ఒప్పుకొన్నటుల జమీందారే భరించాడు.

5. 1937 సంవత్సరములో కాళీపట్నము జమీందారుకు అతని కౌలుదారుకు తగాదా వచ్చింది. నరసాపూర్ జాయింటు మేజిస్ట్రేటు ముందు 145 క్రి.ప్రొ.కా. క్రింద ఎ. వెంకట్రామన్‌పై కేసు దాఖలు చేయబడింది. జమీందారు రైతులకు ఆశలుగొల్పి వారిని కీ. శే. వెంకట్రామన్ గారికి వ్యతిరేకంగా ఉపయోగించు కొన్నాడు. 17-6-37 తేదీన జమీందారు కనుకూలముగా తీర్పు చెప్పబడింది. అప్పీలులోకూడ హైకోర్టు 20-1-1938 తేదీన జమీందారు కనుకూలంగా తీర్పు యిచ్చింది.

6. 1938 ఆరంభములో హైకోర్టులో తనకనుకూలంగా తీర్పు చెప్పబడినప్పటీనుంచి జమీందారు తన వాగ్ధానాలను భంగపరుస్తున్నాడని రైతులు చెబుతున్నారు. జమీందారుకు యిక రైతుల సాయ మక్కర లేదు. కౌలుదారును పొలంనుండి వెళ్లగొట్టుటలో జయం పొందిన తరువాత యిపుడు జమీందారు గ్రామస్థులు ప్రాజెక్టుక్రిందికి తేబడిన భూములలో కల్గివున్న హక్కులను భంగపరచ పూనుకొన్నాడు,

7. గ్రామంయొక్క మొత్తంజనాభా 3500. వీరంతా అగ్నికుల క్షత్రియ, తెలగ, శెట్టిబలిజ కులాలకుజెందిన చేపలు పట్టువారు. దాదాపు వారంతా నిరక్షరకుక్షులు, వెనుకబడినవారై వున్నారు మెరక పట్టాభూమి బీదది, చెప్పదగిన పంటపండదు. గ్రామస్థుల ప్రధానవృత్తి చేపలుపట్టుట. 900 ఎకరాల మెరకభూమి తప్ప గ్రామంలో తక్కిన భూమంతా సముద్రపు పోటుకు లోనవుతుంది. మరియు, ఒక ప్రత్యేకజాతి చేప, (రొయ్యలు) సమృద్ధిగా దొరుకుతుంది. ప్రతికుటుంబము చేపలు నిలుపడానికి చుట్టూ గట్టులమధ్య కొంత భూమిని కలిగివుంటుంది. యీ భూమిలో ఆ కుటుంబమువారే చేపలు పట్టుకొనుటయేగాక, వంశ పారంపర్యంగా అనుభవించుటకు, అన్నదమ్ములు భాగాలు పంచుకొను హక్కులనుకూడ కల్గియున్నారు. చేపలు నిలుపడానికి గట్టులు, విభాగపు హద్దులు నేటికికూడ నేలపై కన్పించుతూ వున్నాయి. చేపలు పట్టుట గ్రామస్థుల ప్రధాన వృత్తియేగాక వారికి ఆదాయమునిచ్చు వృత్తి అది ఒకటి మాత్రమే. సంవత్సరములో గ్రామ మొత్తంగా పట్టు చేప ఖరీదు 30 నుండి 40 వేల రూపాయలు వుంటుంది. ఈ చేప సాధారణముగా నరసాపురములో స్థానిక వర్తకులకు అమ్మబడుతుంది. అపుడపుడు రంగూన్, యితర స్థలాలలోని వర్తకులకు రవాణా చేయబడుతుంది. కాళీపట్నం పల్లెకారులకు యితర ప్రదేశాలలోని వర్తకుల మధ్య జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలు సరిగా దాచబడలేదు. అట్టివి కొన్ని మాత్రము దొరకగా దీనితో పంపబడ్డాయి. ఈ ఉత్తర ప్రత్యుత్తరాలను బట్టి కాళీపట్నమునుండి రంగూనుకు రవాణా చేయబడిన చేప విలువ తెలుస్తుంది. గ్రామస్థులు తమ చేపలు పట్టుకొనే హక్కును ఇతర స్థిరాస్థి హక్కులను కాపాడుకొనునట్లే కాపాడుకొంటున్నారు. జమీందారు యీ చేపలు పట్టుకొనే భూమిని తన స్వాధీనంలో తెచ్చుకోడానికి, ఈ హక్కును వేలం వేయడానికి చేసిన ప్రయత్నాలను రైతులు జయప్రదంగా ఎదిరించారు. 1914 సం॥లో జమీందారు పరిసర గ్రామస్థుల సాయంతో యీ భూమిని ఆక్రమింప జూచినపుడు కూనీలుకూడ జరిగాయి. ఆ సందర్భంలో జరిగిన క్రిమినల్ కేసులలో గ్రామస్థులు అనాది నుండి అనుభవించుచున్న చేపలు పట్టు హక్కును కృష్ణాజిల్లా జడ్జీ గుర్తించెనని కూడ చెప్పబడుతూంది.

8. గ్రామస్థులు చేపలుపట్టుకొనుహక్కుతో పాటు బంజరు, అడవి భూములలో పుల్లరిహక్కులు అనుభవించు చుండిరి. రైతులు చేపలు పట్టుకొన్నందుకు, పశువుల మేపుకొన్నందుకు, పుల్లవగైరా తెచ్చుకొన్నందుకు ఎట్టిపన్నులు జమీందారుకు చెల్లించుచుండలేదు. 1902 కు పూర్వం గ్రామస్థులు బంజరు, అడవి భూములు జమీందారువి కావని నమ్ముచుండిరి. 1902 వ సర్వేలో బంజరు, అడవి భూములు, ఉప్పు ఏరులు కూడ కాళీపట్నం మొఖాసాలో చేర్చబడినను గ్రామస్థులు అనాదినుండి అడవి, బంజరు భూములు ఉప్పుఏరులలో తామనుభవించుతున్న హక్కులకై తరువాతకూడ జమీందారుకు ఏమియు చెల్లించుచుండలేదు.

9. జమీందారు యిర్రిగేషను ప్రాజెక్టు మంజూరు పొందుటకు నిర్మాణానికి వ్యయప్రయాసలు పొందెననుటకు సందేహములేదు. అతడు న్యాయము, ధర్మబద్ధమైన శిస్తును పొందుటకు హక్కు కలిగి వున్నాడు. ప్రస్తుతం మేము జమీందారువాదనను పూర్తిగా ఉల్లేఖించుటలేదు.

10. మేము మిమ్ములను ఒకవైపు జమీందారు యొక్క హక్కులను, వాదనలను రెండోవైపు బీద అమాయకులైన రైతులయొక్క హక్కులను గమనించి న్యాయము కలుగజేస్తారని మనవి చేసికొంటున్నాము. పూర్తిన్యాయాన్ని కలుగజేస్తారని నమ్ముతున్నాము,



# కాళీపట్టణం జమీందారు గావించిన వాగ్దానం

## ప్రభుత్వానికి పంపుకున్న పిటిషన్ వివరాలు

[కాళీపట్నం జమీందారుగారు, ఎ. వెంకట్రామన్ గార్లు జిల్లా కలెక్టరు ద్వారా లేబరు కమీషనరుకు, బంజరు భూమిని ఆయకట్టులో చేర్చుటకు సాయపడవలసినదనుచు పెట్టుకొన్న పిటిషను కాపీ అనువాదం క్రింద ప్రకటించాము. నిష్పాక్షిక దృష్టితో చదివినవారు కాళీపట్టణ గ్రామ బీద ప్రజలకు 800 ఎకరాలు యిచ్చుటకు వాగ్దానం గావించబడినదనే సత్యాన్ని గుర్తించడానికి యిది సాయపడుతుందని ఆశించుతాం. దీనిలో రైతులు అనాది సిద్ధంగా ఆ బంజరు భూమిలో అనుభవించు చేపలు పట్టుకొనే హక్కు వదలు కొన్నందుకుగాను సాగులోకి తెచ్చిన భూమి 800 ఎకరాలు వారికిచ్చుటకేగాక మొదటి మూడు సంవత్సరాలు పన్నులో సగం భాగం వదలివేస్తానని వాగ్దానము గావించినటుల కూడ స్పష్టపడుతుంది. వేరొకచో ప్రకటించిన దండు నారాయణరాజు, గొ. వెంకన్న ఎం. ఎల్. ఏ., గార్లు రివిన్యూ మంత్రి ప్రకాశంగారికి సమర్పించిన మెమొరాండము రైతుల అనాది హక్కును రుజువు పరుస్తూంది. జమీందారు ప్రాజెక్టుకొరకు ఖర్చిడిన 160 వేల రూపాయలకు అడవిని అమ్ముట ద్వారా 60 వేలును, 2000 ఎకరాల పాత బంజరు అమ్ముట ద్వారా 2 లక్షలు ఆదాయం పొందాడు. ఇదిగాక జమీందారు మగతా ద్వారా యేడాదికి 12 వేలు ఆదాయం పొందుతున్నాడు. అతడు నామకా; 50 రూ. మాత్రమే ప్రభుత్వానికి పేష్కసు చెల్లించుతున్నాడు. ఈసంగతులు గమనించిన డాక్టరు పట్టాభిగారి రిపోర్టు నమ్మి గాంధిగారు సోషలిస్టులు ఒకజమీందారుగారి భూమి అక్రమణను అక్రమంగా ప్రోత్సహించు తున్నారని హరిజన్‌లో వ్రాసిన వ్యాసం కొందరి మనస్సులలో కలుగజేసిన అనుమానాన్ని తొలగించునని కూడ ఆశించుతున్నాము. సంపాదకుడు.]

లేబరు కమిషనరుగార్కి పశ్చిమ గోదావరిజిల్లా కలెక్టరుగారి ద్వారా

1. మ. రా. శ్రీ. శ్రీ రాజా కొండ్రేగుల శ్రీనివాస జగన్నాధరావు పంతులు, జమీందార్ ఆఫ్ గజ్జారం ఎస్టేటు, రాజమండ్రి కాపురస్తులునూ.

2. ఎ. వెంకట్రామన్. ఎస్క్వైర్, బార్-ఎట్-లా నరసాపూర్, పశ్చిమ గోదావరిజిల్లా గార్లు దాఖలుచేసికొన్న పిటీషను.

అయ్యా,

1. ఒకటవ పిటీషనరు ల్యాండ్ హోల్డరును, యితర ఆస్థులతోపాటు పశ్చిమ గోదావరిజిల్లా నరసపూర్ తాలూకాకు చెందిన కాళీపట్నము మొఖాసా గ్రామాన్ని కలిగివున్నాడు.

2. రెండవ పిటీషనరు, ప్రపంచ యుద్ధకాలంలో కొంత రిక్రూటింగ్‌పని చేసియు, ఇండియన్ ఫీల్డ్ అంబ్యులెన్సు దళంలో సభ్యుడుగా వుండియు, నెట్టీ అండ్ బార్‌టన్ ఓడపై మిలిటరీ ఆస్పత్రులలో నాన్‌కమిషనర్ ఆఫీసరుగా పనిచేసియు మెప్పు పొందిన పలుకుబడి కలిగిన నరసాపూర్ నివాసస్థుడు.

3. రెండవ పిటీషనరు 30-9-23 తేదీన రిజిష్టరు చేయబడిన ఎగ్రిమెంటుద్వారా మొదటి పిటీషనరునుండి 2500 ఎకరముల బంజరుభూమిని (waste land) ఇచ్చునట్లు వాగ్దానం పొందినాడు. మరియు 3-1-26 తేదీన రిజిష్టరు చేయబడిన ట్రస్టు ఖరారునామా ద్వారా పై భూమిలోనుండి 500 ఎకరముల భూమి అణచివేయబడిన వర్గాల లాభం నిమిత్తం ఉపయోగించబడటానికి ఒప్పుకొన్నాడు. రెండవ పిటీషనరు గూడూరు రామచంద్రుడు, చెన్నాప్రగడ భానుమూర్తి పంతులు గార్లను పై ట్రస్టును అమలునందుంచుటకు నియమించాడు.

4. మొదటి పిటీషనరు, రెండవ పిటీషనర్లమధ్య జరిగిన తర్వాత ఎగ్రిమెంటులద్వారా కూడ రెండవ పిటీషనరు మొఖాసాలోని బంజరుభూమిలో (waste land) పై చెప్పిన పెద్దమొత్తాన్ని పొందుటకు వాగ్దానం పొందియున్నాడు.

5. గోదావరి వెస్ట్రన్ డెల్టాలో రెండవ పంట సాగులో (Second Crop Zone) 4500 ఎకరాలు చేర్చుటకు స్థానిక జిల్లా ఉద్యోగులు ఆలోచించుచున్నారనియు, విచారణకు పంపిన స్పెషల్ ఆఫీసర్లు కాళీపట్నం మొఖాసాకు, ఆ చుట్టుపట్లకు జేరిన భూభాగాన్నే యిందుకు సెలెక్టు చేసారని యీ పిటీషనర్లు తమకు మనవి చేసుకొంటున్నారు.

6. ఆ భూమి కాళీపట్నంలోను, దాని అనుకొని వున్న ప్రభుత్వ గ్రామాలగు వెంప, ముత్యాలపల్లి, లాసురగుంట్ల పాడులకు చెందివున్నదని పిటీషనర్లు తెలుపుకొంటున్నారు.

7. పిటీషనర్లు, కాళీపట్నంలో మాగాణి సాగుకు పనికివచ్చు 4000 ఎకరాల ఒకే ప్లాటు భూమి వున్నదని మనవి చేసుకొంటున్నారు.

ఇంకా పిటీషనర్లు:—

(1) ఇది సమానంగా ఒకే ప్లాటుగావున్న భూమి అనియు రెండవపంట వరిసాగుకే పనికివస్తుందనియు.

(2) ఇది మెరకగావున్న అక్రమణలోలేని బంజరు భూమి అనియు, మెరక పంటకు తోటలకు పనకి రాదనియు.

(3) మొదటి పంట కాలంలో మురుగు వస్తుందనియు.

(4) డ్రామ్‌కు సమీపంలో వున్నదనియు.

(5) దాని సరిహద్దులు స్పష్టంగా వున్నాయనియు.

(6) గోస్థనది—వేల్పూరు ఛానల్‌నుండి వచ్చిన దురుసుమర్రు కాలువ పొడిగించుటవల్ల తేలికగా రెండవ పంటకు నీళ్లు సప్లయి చేయవచ్చుననియు.

(7) ఈ భూమి పరిసర ప్రభుత్వ గ్రామాలలో దొరకు బంజరు భూమికంటే మంచిదనియు, రెండవ పంట సాగుకు బాగుగా పనికి వస్తుందనియు, బలం చేయ నక్కరలేదనియు.

(8) కాళీపట్నంలో వ్యవసాయదారులు, తమ పశువులకు చక్కని బీటి భూములను కాళీపట్నం మొఖాసాలో కల్గి వుంటారనియు మనవి చేసుకొంటున్నాం.

8. పైన వివరించబడిన కారణాలన్నిటిని అవకాశాలన్నిటినీ గమనించి ఈ 4000 ఎకరముల పైగా వున్న భూమిని రెండవ పంట సాగులో చేర్చవలసినదని పిటీషనర్లు విన్నవించుకొంటున్నారు.

పిటీషనర్లు క్రిందవి చేయడానికి తయారుగా వున్నామని తెలుపుకుంటున్నారు.

(1) పబ్లిక్ డిపార్టుమెంటువారిచే అంగీకరింపబడిన ప్లాను ప్రకారం యీ భూమికి నీటి సప్లయి కోసం అవసరమైన కాలువను స్వంత ఖర్చుతో త్రవ్వించుటకును.

(2) ఈ పనికి కావలసిన భూమిని అంతను ఎట్టి ముదరా అపేక్షించకయే యిచ్చుటకును, పట్టాదార్లకు జెందిన భూమిని ప్రైవేటురాయబారాల ద్వారా పరిష్కారం చేయుటకును.

(3) పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటువారి ప్లానులు, అంచనాల ప్రకారం కాలువ మొదటనుండు తూములు (head Sluice) యితరపనులు స్వంతఖర్చుతో చేయుటకును.

9. పిటీషనర్లు, మొత్తం భూమిలో ఐదవభాగం అణచివేయబడిన వర్గాలవారి లాభంకోసం యివ్వబడుతుందనీ, అనగా కాళీపట్నంలో ప్రభుత్వముచే రెండవ పంట సాగులో చేర్చబడిన భూమిలో భాగాన్నే యిస్తామని తెలుపుకొంటున్నారు.

ఇందులోనే ఇదివరకే రెండవ పిటీషనరుచే అట్టి పనికే వాగ్దానం చేయబడిన 500 ఎకరములు జేరివుంది. ఆయకట్టులో 4000 ఎకరాలు చేర్చబడిన 800 ఎకరములు యిందుకై వినియోగింపబడతాయి.

ట్రస్టుద్వారా నియమింపబడిన గూడూరు రామచంద్రరావు, చెన్నాప్రగడ భానుమూర్తిగార్లు ట్రస్టుఆస్తిని ఉద్దేశించిన రీతిగా అంటే స్థానికంగా గ్రామంలోవున్న బీదలు, అణచివేయబడిన ప్రజలకు భూముల నిచ్చుటకుగాక తదితర విధాల ఖర్చుపెట్ట దలచుతున్నారని నమ్ముటచే వారిని తొలగించి, పిటీషనర్లు పైన ఉదహరించిన రీతిని వినియోగించుటకు నిర్ణయించిన భూమిని గ్రామంలో స్థానికంగావున్న బీదలకు, అణచివేయబడిన వర్గాలకు పంచుటకు ప్రభుత్వానికి అప్పగించదలచారు. కాళీపట్నం భూములు రెండవపంట సాగులో చేర్చబడటంతోనే అవసరమైన వ్రాతకోతలు వ్రాయించగలవారు. ప్రభుత్వమువారు కాళీపట్నంభూములు ఆయకట్టులో చేర్చవలసిందని కోరుతున్నారు.

10. మొదటి పిటీషనరు బీదలు, అణచివేయబడిన తెగలవారికి మొదటి మూడు సంవత్సరాలలో అనగా సరిగా పండి చెల్లించుకొనుశక్తి కలుగువరకు పన్నులో సగంభాగం వదలివేస్తాననికూడ తెలయజేయుచున్నాడు.

11. పిటీషనర్లు గవర్నమెంటు గ్రామాలలోని భూములకంటే కాళీపట్నం భూములకు ఆయకట్టజేర్చుట ప్రభుత్వాన్ని ఆర్థికం లాభప్రదమని మనవిచేసికొంటున్నారు. ఏమంటే భూమిదగ్గరకు నీళ్లు తీసుకొనివచ్చుటకగుఖర్చులన్నిటిని పిటీషనర్లే భరించుచున్నారు. ప్రభుత్వంవారు ఎకరానికి రు 5 లు చొప్పున నీటితీరువా వసూలు చేసికొంటారు. పరిసరి గవర్నమెంటు గ్రామాలలో ఐనచో నీటితీరువా ఎకరానికి రు 3-4-0 నుండి రు 3-12-0 చొ॥ మాత్రమే పొందుతారు.

12. ప్రభుత్వం స్థానికంగావున్న బీదలు, అణచివేయబడిన ప్రజలనుకూడ, గోదావరి ఆనకట్ట లెవెలు హెచ్చించి సమీప గవర్నమెంటు గ్రామాలలో భూమిని కూడ సాగులోకి తెచ్చి సంతృప్తి పరచవచ్చును.

ఈ పరిస్థితులలో పిటీషనర్లు తమరు దయతో కలెక్టరుగారికి, ప్రభుత్వానికి కాళీపట్నం మొఖాసాలోని సదరు భూమిని రెండవ పంటసాగు భూమిలో జేర్చవలసిందని సిఫార్సుచేస్తారనీ, ఆవిధంగా పిటీషనరులకు, అణచివేయబడిన వర్గాలకు సాయపడాలనీ విన్నవించుకొంటున్నాము. (తేదీ 5-5-28)

# ఫాసిస్టుల యుద్ధ పిపాస

## వీరి దాడిని రష్యాపై త్రిప్పుటకు బ్రిటను ఫ్రాంసుల ఎత్తులు

గతవారము జర్మనీ రుమేనియాకు అల్టిమేటము పంపినదని చూచాము. రుమేనియా తనకెట్టి అల్టిమేటమురాలేదని పైకి కబుర్లుచెప్పింది. కాని మార్చి 18 వ తారీఖున రష్యాకు బ్రిటను కబురు పంపించింది. జర్మనీ రుమేనియాను ఆక్రమించవచ్చు. ఆపరిస్థితులలో రష్యా ఏమి చేస్తుందని అడిగింది. రష్యా దానికి జవాబుగ వెంటనే బ్రిటను, ఫ్రాంసు, పోలండు, రుమేనియా, టర్కీ, సోవియటు రష్యా కలసి ఒక సమావేశము జరిపి ఒక నిర్ణయానికి రావాలని తెలియజేసింది. జర్మనీ దాడులను అరికట్టాలంటే, జర్మనీకి వ్యతిరేకంగా యుద్ధం చేయడానికి బ్రిటను రష్యాలు కలసి ఒక యుద్ధ ఒడంబడిక చేసుకోవాలి. జర్మనీ యూరపులో తూర్పు రాజ్యాలపై, పోలండు, రుమేనియా, మొదలగు దేశాలుపై దండెత్తినా లేక పడమట బెల్జియం, హాలండు, స్విట్జర్లండు దేశాలపై దండెత్తినా, జర్మనీపై యుద్ధము ప్రకటించాలి. బ్రిటను తన నౌకా సైన్యముతో జర్మనీని చుట్టుముట్టాలి.

## బ్రిటను సూచన

ఈసూచన బ్రిటనుకు నచ్చలేదు. ఇది ఆచరణ సాధ్యముగాదని ఛాంబర్లేను త్రోసివేశాడు. ఛాంబర్లేను, జర్మనీ తన ధోరణిని మార్చుకోకుండా, ఏదేశము పైనైనా దాడివెడలితే, వెంటనే శాంతినికోరు దేశాలు సమావేశమై ఏమి చేయాలో ఆలోచించుకొంటాము అని ఒక ప్రకటనచేస్తే చాలునన్నాడు. ఇట్టి ప్రకటనకు ఒప్పుకొనుడని పోలండు, రుమేనియా, ఫ్రాంసు, రష్యాలను ఛాంబర్లేను కోరాడు.

ఛాంబర్లేను ఈమాత్రమైనా కోరడము దేశములోని ప్రజాభిప్రాయాన్ని తాత్కాలికముగా శాంతపరచడానికే తప్ప మరెందుకూ కాదు. లండను టైమ్సు, డెయిలీ టెలిగ్రాఫులాంటి కన్సర్వేటివు పత్రికలుకూడ, అన్ని దేశాలు కలసి జర్మనీని ఎదుర్కోవాలి. లేనిచో ప్రమాదము



సంభవిస్తుందని గోలచేశాయి. న్యూస్‌క్రానికల్ పత్రిక, ఈలా వ్రాసింది. "పోలండుపై జర్మనీ దాడి వెడలితే జర్మనీ పడమట భాగముపై బ్రిటను ఫ్రాంసులు దండెత్తుతామని వాగ్దానము గావించాలి. పోలండుపై దాడి అంటే బహిరంగంగా సైన్యముతో వెళ్ళి దాడి చేయుటయేగాక, దేశములోపల అంతః కలహమును రేపుట, కొన్నిహక్కులను ఇవ్వమని బెదరించుటకూడ దాడిగానే పరిగణించాలి."

బ్రిటిషు లేబరు పార్టీకూడ పోలండుకు మిలటరీ గ్యారంటీ ఇవ్వాలని పట్టుపట్టింది. ప్రజాభిప్రాయము ఇంత తీవ్రంగా ఉన్నప్పుడు ఛాంబర్లేను, జర్మనీ చర్యయెడల తన తీవ్ర అసమ్మతిని తెలియజేస్తున్నట్లు నటించక తప్పిందికాదు. కామన్సుసభలో (బ్రిటిషు పార్లమెంటులో) ఒక ప్రకటన గావిస్తూ జర్మనీ యూరపులో అధికార ప్రాబల్యముకోసం ప్రయత్నిస్తూఉన్నట్లు సందేహము కలుగుతుంది. అంతటితో ఆగునని నమ్మకముకూడ లేదు. ప్రపంచమంతటిపై తన అధికారాన్ని నెలాయించడానికి పూనుకొనినట్లు ఉంది. జర్మనీ ఉద్దేశము ఇదేమైనచో స్వాతంత్ర్యాన్ని ప్రేమించే ఇంగ్లండులాంటి దేశాలు తప్పకుండా ఎదుర్కొంటాయి." అని హెచ్చరించాడు. అంటే జర్మనీ బ్రిటనుపైగాని బ్రిటను పలుకుబడి క్రింద నుండు దేశాలపైగాని దండెత్తిననే, జర్మనీపై బ్రిటను యుద్ధము చేస్తుందికాని ఈలోపల జోక్యము కలిగించుకోదనియే గదా దీనిఅర్థము.

ఆప్రకటనలో ఛాంబర్లేను, తన నిజమైన దృక్పథము ఏమిటో స్పష్టముగా తేల్చాడు. "జర్మనీ తన వర్తక వ్యాపారాన్ని పెంపొందించుకుంటే ఇంగ్లండుకెట్టి అభ్యంతరమూలేదు. యూరపులో ఆయాదేశాలు తమతమ దేశాలలో ఏవిధంగా పరిపాలిస్తున్నాయో, ఏ రాజ్యాంగ విధానాన్ని అవలంబించి పని చేస్తున్నాయో ఆభేదాల ననుసరించి యూరపును రెండు భాగాలుగా చీల్చుట ఇష్టములేదట!"

ఛాంబర్లేను తన పూర్వపు దృక్పథాన్ని మానలేదు. ఫాసిస్టులను వెనుకనుండి బలపరచుటకు మునుపటివలె ప్రయత్నిస్తున్నాడు.

## జర్మనీ - మెమెలు

బ్రిటను, ఫ్రాంసులు రష్యాతో ఒడంబడిక చేసుకోడానికి అభ్యంతరమూ తెలియజేస్తూ ఉన్నప్పుడే, లిథూనియా విదేశాంగ మంత్రి మెమెలును జర్మనీకి తిరిగి ఇచ్చివేయడానికి ఒప్పుకొన్నాడు. మెమెలును వెంటనే ఇస్తే ఇచ్చినట్లు, లేనిచో లిథూనియా స్వాతంత్ర్యానికే భంగముకలుగుతుందని హిట్లరు బెదరించినపుడు చిన్నదేశము లిథూనియా ఏమిచేస్తుంది?

23 వ తారీఖు ఉదయము 5 గంటలకు జర్మనీ సైన్యము మెమెలులో ప్రవేశించాయి. లిథూనియాలో జర్మనీ ఒక ఒడంబడిక చేసుకుంది. దానిలో విషయాలు : ఒక దేశముపై మరియొకదేశము దాడి వెడలగూడదు. మరియే దేశమైనా తమపై దండెత్తినచో రెండవ దేశము,దండెత్తిన దేశమునకు సాయము చేయకూడదు. లిథూనియా వర్తకము నూటికి 80 వంతులు మెమెలు రేవుగుండానే జరుగుతుంది అందుచే లిథూనియా సౌకర్యము కోసమని మెమెలులో స్వేచ్ఛగా వర్తకము చేసుకోడానికి ఒక స్వతంత్ర వర్తక స్థలాన్ని జర్మనీ ఏర్పాటు చేయుటకు అంగీకరించింది. నిజానికి, మెమెలు యొక్క సౌభాగ్యము, జీవనము ఈ వర్తకము మీదనే ఆధారపడి యుండుటచే మెమెలుపట్టణ సౌకర్యముకోసమే ఇట్టి సదుపాయాన్ని హిట్లరు కలుగజేశాడు.

## జర్మనీ : రుమేనియా

రుమేనియాకు జర్మనీ అల్టిమేటము పంపినది లగాయతు, రుమేనియా, తన సైన్యాన్ని హంగరీ సరిహద్దువద్ద ప్రోగుచేసికొని తయారయినది. హంగరీకూడ తన సైన్యాన్ని రుమేనియను సరిహద్దున ప్రోగుచేసింది. ఈ పరిస్థితులలో రుమేనియా బ్రిటను తనకు సహాయము చేయడానికి ముందుకు వస్తుందేమో అని ప్రశ్నించింది. ఎదురు చూచింది. కాని బ్రిటను దృక్పథము జర్మనీని వ్యతిరేకించునట్లు లేనందున జర్మనీతో వర్తకపు టొడంబడిక నొకదానిని చేసుకుంది. దాని ప్రకారము:

1. జర్మనీ, రుమేనియా సహజ సంపత్తులను ముఖ్యముగా వ్యవసాయాన్ని పెంపొందించడానికి పూనుకుంటుంది. దానికి కావలసిన టెక్నీషియన్లను, (శాస్త్రజ్ఞులను, నిపుణులను) యంత్రాలను పంపుటకు ఒప్పుకుంది. ఈవ్యవసాయపు సరకులలో, పశువులకు మేత, నూనె గింజలు, నారమొక్కలు, అడవులను ప్రత్యేకముగా వృద్ధి పొందిస్తుందట.

2. రాగి, క్రోమియము, మాంగనీస్, బాక్సైటు, అల్యూమినియములను విరివిగా తయారు చేయుటకు క్రొత్త కంపెనీలను జర్మనీ రుమేనియాలో స్థాపిస్తుంది. ఈ లోహాలు, ఆయుధ పరిశ్రమకు చాల ముఖ్యమని పాఠకులు గమనించాలి.

3. రుమేనియాలో పెట్రోలు ఉత్పత్తిని ఎక్కువచేయుటకు, క్రొత్త బోరింగులు వేస్తుందట. దీనిని అమ్ముటకు తగిన ఏర్పాట్లు కూడ జర్మనీయే చేస్తుందట.

4. రెండు దేశాలు కలసి కొన్ని ఫ్రీజోను లను రుమేనియాలో ఏర్పాటుచేసి క్రొత్త పరిశ్రమలను, వర్తక శాఖలను ఏర్పాటు చేస్తాయి.

5. రుమేనియను సైన్యమునకు కావలసిన ఆయుధములన్నింటిని జర్మనీ సప్లయి (సరఫరా) చేస్తుంది. వాటి ఖరీదుకు రుమేనియా తన వ్యవసాయ సరకులు, లోహాలు ఎగుమతి జేసి చెల్లించాలి. ఈ ఆయుధాలను దింపడానికి రేవు పట్టణాలలో ప్రత్యేక ఫ్రీజోనులు ఏర్పాటు చేస్తుందట.

ముఖ్యముగా ఈ క్లాజును పరిశీలిస్తే, ఈ ఒడంబడికయొక్క ఉద్దేశమేమిటో స్పష్టమవుతుంది. జర్మనీ ఆయుధాలు డాన్యూబ్‌నది ద్వారా గాని, రుధూనియామీదుగ మోటారు కారులలోగాని, రైలులోగాని నడుపుటకు వీలున్నవి. అయినా, రుమేనియా రేవులన్నిటిలో, నల్లసముద్రమునందున్న రేవులలోగాని జర్మనీ నావలను రానివ్వడానికి ఒకే అర్థముంది. ముందు ముందు రష్యాపై దండెత్తడానికి తగిన ఏర్పాట్లు: ముఖ్యముగా నల్లసముద్రానికి ఆ వైపునుండు సోవియటు పెట్రోలు పరిశ్రమ కేంద్రాలపై [illegible]బడడానికి వీలవుతుంది.

6. ఈ ఒడంబడిక 5 ఏండ్లు పాటు 1944 మార్చి ఆఖరువరకు అమలులో ఉంటుంది. రెండు ప్రభుత్వములూ దీనిని రాటిఫైచేసిన ఒక నెల రోజులలో అమలులోనికి వచ్చును.

ఈ ఒడంబడిక రుమేనియా ఆర్థిక జీవనాన్ని తద్వారా దీని రాజకీయ జీవితాన్ని జర్మనీకి అప్పజెప్పడముగాక మరేమి? రుమేనియా విదేశాంగ మంత్రి మాత్రము కాదంటాడు. ఇతర దేశాలు కూడ ముందుకువస్తే, తాము వారితోనూ అట్టి ఒడంబడికలు చేసుకోడానికి తయారు అన్నాడు.




కాని లండనులోని ఫైనాన్సియల్ న్యూస్ అను పత్రిక ఈ ఒడంబడికను గూర్చి ఇలా అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. ఇది రుమేనియాపై జర్మనీ ఆధిపత్యము పూర్తిగా,ఇంతవరకుగాదు, కాని ముందు ముందు అట్టి ఆధిపత్యానికి దారి తీస్తుంది. రుమేనియాను జర్మనీ పంజానుండి తప్పించాలంటే బ్రిటను త్వరగా, నిస్సందేహముగా, రుమేనియాకు సాయముచేయడానికి ముందుకు రావాలి. ఈ ఒడంబడికను త్రోసిపుచ్చడానికి రుమేనియా ప్రభుత్వము సాహసించునంత సాయముచేయాలని తెలియచేసింది.

జర్మను పత్రికలే ఈ ఒడంబడికయొక్క అర్థమును మరింత స్పష్టముగా ప్రకటించాయి. "ఈ ఒడంబడిక రుమేనియా—జర్మనీ దేశాల సంయుక్త పంచవర్షీయ ప్రణాళిక"అని. జర్మనీ చెప్పినట్లు రుమేనియా చేయడానికి తయారైనప్పుడే పంచవర్షీయ ప్రణాళిక అవుతుంది. అందుచే జర్మనీ రుమేనియాలో తన ఆశయాన్ని చాలవరకు నెరవేర్చుకుంది. ముందు ముందు రష్యాపై దండయాత్రకు పూర్తిగా ఆక్రమించుకోవాలనుకుంటే ఆలా చేయడానికి ఎట్టి అభ్యంతరములు లేకుండ జేసుకోడానికి ఇది సాధనము కూడాను.

## జర్మనీ : పోలండులు

బ్రిటను ఫ్రాంసులు దాడులకు వ్యతిరేకముగా చేయదలచుకొనిన ప్రకటనను పోలండునుకూడ అంగీకరించమని కోరింది. పోలండు నిరాకరించింది. తనపై జర్మనీ దాడి వెడలినపుడు దాని విషయమై చర్చించడానికి ఒక కాన్ఫరెన్సు కూడితే తనకేమీ లాభము రాకపోవడమేగాక, అట్టి ప్రకటన చేసిన మరునాడే జర్మనీ దాడిని కోరి తెచ్చుకోవడమవుతుంది.

పోలండు రష్యా సూచననుగూడ నిరాకరించింది. తన సంరక్షణార్థమైనా రష్యా సేనలు పోలండులో ప్రవేశించడానికి పోలండు అంగీకరించడములేదు. సోవియటు యూనియను సైనికులు, పోలండులోని యుక్రెయినులు, బైలో రష్యనులు, పోలండువారి స్వాతంత్ర్యానికి పోరాడినపుడు. అచ్చటకూడ విప్లవజ్వాలలు బయలుదేరి ప్రస్తుతమున్న నిరంకుశపాలన దగ్ధమైపోతుందేమోనని భయపడుతున్నాడు.

జర్మనీ పోలండుకు కొన్ని షరత్తులను పంపి వానిని అంగీకరించవలసినదిగా కోరినట్లు తెలుస్తూ ఉంది. వానిలో ఒకషరత్తు డాన్జిగ్ పట్టణము. దాని పరిసర ప్రాంతాలను జర్మనీకి ఇచ్చివేయవలయును. జర్మనీకిని జర్మనీలో మరియొక భాగమైనా తూర్పు ప్రష్యాకును మధ్యనున్న డాన్జిగ్ కారిడరును (పోలండు దేశభాగాన్ని) కూడ ఇచ్చివేయమని కోరియుంటే ఆశ్చర్యముండదు. పోలండుకూడ పూర్తిగా జర్మనీని ఆర్థికంగాను, విదేశ రాజకీయ వ్యవహారాలందునూ అనుసరించవలసినదిగా కూడ కోరియుండవచ్చును. పోలండు వీనికేమి జవాబిచ్చినదీ తెలియదు. కాని జర్మను భయముతో తన సేనలను మొబలైజు చేస్తూ (యుద్ధానికి ఆయత్తముగావిస్తూ) ఉంది. పోలండు జర్మను సరిహద్దులలో పోరాటముకూడ సాగుతూ ఉందని వార్తలు వస్తున్నాయి. పోలండు సేనానాయకులు, తాము ఎంత బలవంతమైన ప్రభుత్వం బెదరించినా లొంగమని, యుద్ధానికి తాము తయారుగ ఉన్నామని ప్రకటిస్తున్నారు. దేశములో అన్నిపార్టీల ప్రభుత్వాన్నిగూడ ఏర్పాటు చేయడానికి పూనుకుంటున్నారు. ఇంతవరకు ప్రవాసమందుంటూ ఉన్న విటోస్ అను రైతు నాయకుని తిరిగి దేశమునకు పిలిపించి. మంత్రి వర్గములోకి కూడా తీసుకుంటారట!

## జర్మనీని రష్యాపై ఎక్కత్రోలుచున్నారు

జర్మనీ, పోలండులోనూ, రుమేనియాలోను తన పలుకుబడిని, అధికార్న బలపర్చుకోడానికి ఇట్టి ప్రయత్నాలు చేస్తూ ఉంటే బ్రిటను, ఫ్రాంసులు అడ్డేమీ రావడములేదు. ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీపత్రిక హ్యూమనైట్ వ్రాసినట్లు జర్మనీ ఆక్రమణల నరికట్టడానికి కాగితపు టొడంబడికలు చాలవు. ఆయుధాలు ధరించాలి. కాని ఈ దృక్పథము ఫ్రెంచి బ్రిటిషు సాహుకార్ల కెందు కుంటుంది.

శాంతినికోరే ప్రజాతంత్ర దేశాలన్నీ కలసి ఒడంబడిక చేసుకోలేకపోయినపుడు ఫ్రాంసు చాల సంతోషించింది ఇకముందు యూరపులో పశ్చిమభాగాన మాత్రము జర్మనీ ఆక్రమణ సాగకుండునట్లు ఏర్పాట్లు చేసుకుంటామని కూడ ప్రకటించింది. ఈ విధానానికి దేశములో వ్యతిరేకము లేకుండా జేయడానికి స్వదేశ సంరక్షణ అనుపేరుతో డిక్రీలతో పాలించడానికి పూనుకుంది. ప్రజాతంత్రహక్కులను అణచడానికి పూనుకుంటూ ఉంది! కమ్యూనిస్టుపార్టీని అణచివేయడానికి తీవ్ర కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారము సాగిస్తూ ఉంది. స్పెయినులో ఇంటర్నేషనల్ బ్రిగేడును నడిపిన ఫ్రెంచి పార్లమెంటులో కమ్యూనిస్టు ప్రతినిధియైన ఆంద్రీ మార్టిన్, ఫ్రెంచి దేశీయుల హత్యకు కారకు డయ్యాడని ప్రచారము సాగిస్తున్నారు.

బ్రిటనులోకూడ ఆయుధాలను ఎక్కువ చేస్తున్నారు. నిర్బంధ సైనిక శిక్షణ ఏర్పాటు చేయాలని ప్రయత్నిస్తూ ఉన్నారు. ఇంతవరకు లేబరుపార్టీ కూడ దీనిని వ్యతిరేకిస్తూ ఉంది.

ఇటలీని కొంతసంతృప్తి పరచనిదే, జర్మనీ ఇటలీలు ఫ్రాంసుపై పడుతాయేమోనన్న భయముతో ఇటలీతో సంప్రదింపులు సాగించడానికి లావెల్, అబిసీనియాను ఇటలీకి అమ్మిన ఫ్రెంచి మితవాద ఫాసిస్టును, పంపుతారన్న వార్తలు వస్తున్నాయి. జిబోతి, ట్యూనిస్, సూయజు కాలువలో కొన్ని ప్రత్యేక సౌకర్యాలు కలిగిస్తామని కూడ ఆశ చూపుతున్నాయి అందుచేతనే మొన్న ముస్సోలినీ, ఫాసిస్టు పార్టీ 20 వ వార్షికోత్సవమున మాట్లాడుతూ, యుద్ధానికి కాలుదువ్వుతూ మాట్లాడినా ఆ ఉపన్యాసము చాల శాంతియుతంగాఉందని, బ్రిటిషు ఫ్రెంచి పత్రికలు పొగుడుతున్నాయి. ఫ్రాంసు వెంటనే ఇటలీతో రాయబారాలు ఆరంభించాలనీ కూడ వ్రాస్తున్నాయి. ఇటలీదేశపు రాజు, బ్రిటనుతో ఒడంబడిక చేసుకున్నాము, ఫ్రాంసు ఇటలీ కోర్కెలను అంగీకరిస్తే, దానితోను అట్టి ఒడంబడిక చేసుకుంటామని ప్రకటించినపుడు ఫ్రెంచి ప్రభుత్వము ఉప్పొంగిపోయింది

ఈ పై ఘటనలన్నీ చూస్తే ఫ్రాంసు బ్రిటనులు జర్మనీ ఇటలీలను రష్యాపై ఎక్కత్రోలడానికి ప్రయత్నిస్తున్నాయని తేలుతుంది. అందుకనే పోలండు, రుమేనియాలనుకూడ జర్మనీకి వదిలివేశాయి.

## జర్మనీ కాలనీలలో ఏమి చేస్తుంది

హిట్లరు తన దేశములోను, తానాక్రమించిన దేశాలలోను గావించిన దురంతాలను, ప్రజలను పీడించే పద్ధతికి అంతులేదని మా పాఠకు లిదివరకే తెలుసుకొని ఉంటారు. ఈ మధ్య జర్మనీలో క్రొత్త అప్పు పత్రాలను ప్రవేశపెట్టాడు. వీనిని దేశములోని పరిశ్రమాధికారులు, వర్తకులు, అందరూ తీసుకోవాలి. వీనిని తీసుకొని, మూడేండ్ల శిస్తును వెంటనే చెల్లించాలి. ప్రభుత్వానికీ విధంగా ముందుగా అప్పుగా శిస్తులు చెల్లించినా, ఈ అప్పుమీద ఎట్టి వడ్డీకూడ ఇవ్వరట! జర్మనీలోనే ఇలా ఉన్నప్పుడు జర్మనీ కాలనీలలో అది ఏమి చేస్తుందా అని కొందరికి ఆలోచన కలుగవచ్చు. దానికిజవాబుగా నాజీలు తమ కాలనీల విధానాన్ని ప్రకటించారు.

1. కాలనీలలోని ప్రజలకు యూరోపియను నాగరికతగాని, విద్యనుగాని చెప్పకూడదు. ఈ నాగరికత విద్యకు వీరు అర్హులుకారు. కేవలం జర్మనీ జాతి సొత్తు ఇది.

2. జర్మనుల మధ్య, నేటివుల మధ్య వివాహములు జరుగకూడదు.

3. జర్మనులు వారి జాతికి చెందినవారే పౌరులుగా పరిగణించబడుతారు. నేటివులను ప్రత్యేక దశను (బానిస దశను) ఏర్పాటు చేయబడును.

4. నేటివులకు, కోర్టులలో నోరు మెదపవచ్చుగాని, న్యాయాధికారమంతా జర్మనులకే ఉంటుంది. నేటివు నాయకుల మూలంగా చెప్పించాలసి వచ్చినా, తెల్లవారి యాజమాన్యాన క్రిందనే జరగాలి.

## ముస్సోలినీ యుద్ధ పిపాస

మానవత్వముగల ప్రతిమానవుడు ముస్సోలినీ గావించిన ఈక్రింది ఉపన్యాసాన్ని చదివి ఫాసిస్టు ఉపద్రవమేమిటో తెలుసుకోవాలి. ఫాసిస్టు విధానాన్ని రద్దు గావించడానికి ముందుకు రావాలి.

"ఈరోజు యూరపులో చరిత్రాత్మకమైన ఘటనలు జరుగుతున్నాయి. ఆ సమయములో ఫాసిస్టుపార్టీ 20 వ వార్షికోత్సవము జరుగుతూ ఉంది. ఈసమయములో మన సిద్ధాంతాలేమిటో స్పష్టముగా తెలుసుకోండి.

శాంతివాదులు చాల అసహ్యముగా చూడవలసిన మనుష్యులు. శాంతి అనే




పదాన్ని చాల ఎక్కువ వింటున్నాము. దాని బూటకత్వము మనకు బాగా తెలుసు. నాగరికతకు శాశ్వతశాంతి వినాశకరము. అయినా మన యూరోపియను నాగరికతను కాపాడడానికి కొంత కాలము శాంతికావాలి. మన హక్కులు గుర్తించనిదే మనము శాంతి కోసం ఎట్టి ప్రయత్నాలు చేయము.

"రోము—బెర్లిను సమ్మేళనాన్ని ఎవరూ నాశనము చేయలేరు. ఇవి రెండూ ప్రస్తుత నాగరికతయొక్క మిగిలినవారి అభిప్రాయాలన్నిటికి వ్యతిరేకము.

"మధ్యయూరపులో జరుగుతున్న ఘటనలు న్యాయమైనవియే. ఇతరదేశాలు, హిట్లరుకు వ్యతిరేకంగా ఒడంబడిక చేసుకుంటే, మేము వెంటనే యుద్ధానికి దిగవలసివస్తుంది.

"ఫ్రాంసు, ట్యూనిస్, జిబోతి, సూయజులలో మా హక్కులను అంగీకరించాలి. మాడ్రిడ్‌లో ఫాసిజాన్ని పాతిపెట్టుతామన్నారు. కాని కమ్యూనిజాన్నే పాతిపెట్టాము. ఇకనైనా ఫ్రాంసు మా హక్కులను గుర్తించడము మంచిది.

"పరిస్థితులు మారుతున్నాయి. సోదరత్వము, సోదరీత్వము మొదలగు చెత్త పదాలమ వినుటకు అసహ్యమేస్తూఉంది. ఎందుకంటే, ప్రభుత్వాల మధ్య సంబంధము కేవలము పశు బలముమీద, ఆయుధబలముమీద ఆధారపడి ఉన్నాయి. సంబంధాలేమి రాజకీయ విధానాన్ని నిర్ణయిస్తున్నాయి. భౌగోళికంగా జూచినా, చారిత్రకంగా జూచినా, రాజకీయంగా జూచినా లేక సైనిక దృష్టితో చూచినా మెడిటరేనియనులోను ఆడ్రియాటిక్ సముద్రములోను మా హక్కులు అందరిహక్కులకన్నా ప్రధానములు, అత్యంత ప్రధానములు.

"జనసామాన్యపు మామూలు జీవనము (సివిలియను జీవనము) పూర్తిగా నాశనమైనాసరే, ఎక్కువ ఫిరంగులు, ఎక్కువ యుద్ధనావలు, ఎక్కువ యుద్ధ విమానాలు తయారు చేయాలి. బల మున్నప్పుడే స్నేహితులు ప్రేమిస్తారు. శత్రువులు భయపడతారు.

ఏ రక్తమైతే మీ నాళనాళమందు ప్రవహిస్తూ ఉందో, ఇటలీ హక్కుల కోసం ఇతరులయొక్క ఏరక్తాన్ని ప్రవహింప చేయడానికి మనము వెనుకంజవేయమో, అట్టి రక్తవర్ణాభరణాలను ధరించండి. చరిత్ర నంతను మీ త్యాగము, మీధైర్యము, మీశ్రద్ధ మూలంగా మార్చివేస్తున్నారు. మీ జయానికి కారణము మీ మాటోయే.

"నాయకుని నమ్మి మారుమాటాడక యుద్ధము చెయ్యండి!"

ఇవి ఒక దేశాధీశుని మాటలా? లేక నరహంతకుని పిచ్చి ప్రసంగాలా?

# సోషలిస్టు పార్టీ ఎందుకు తటస్థంగా వుంది?

## కామ్రేడ్ జయప్రకాశనారాయణ స్టేటుమెంటు

అఖిలభారత కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ప్రధానకార్యదర్శి కామ్రేడ్ జయప్రకాశనారాయగారు యీ క్రింది ప్రకటన గావిస్తున్నారు :

త్రిపురీకాంగ్రెస్ మహాసభయొక్క డెలిగేట్ల సమావేశంలో పండిట్‌పంత్ తీర్మానం వోటింగుకు పెట్టబడినప్పుడు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ఎందుకు తటస్థంగాఉన్నదనే ప్రశ్నచాలామంది ప్రజలకు కలిగింది. రకరకములైన దురభిప్రాయాలు వ్యాపిస్తూన్నట్లు తెలుస్తోంది. అధికారంలో ఉన్నవారి మెప్పులు సంపాదించే ఉద్దేశంతో సోషలిస్టు పార్టీ నాయకులు మంచిపిల్లవాళ్లుగా ప్రవర్తించారని కొందరు విమర్శిస్తున్నారు. ఇట్టి విమర్శనలు వారికి క్రొత్తకూడా కావు. అట్టివారికి సమాధానం చెప్పడం అనవసరమని నేను భావిస్తున్నాను.

### ఎందుకు వ్యతిరేకించలేదు ?

మేము ఎందుకు తటస్థవిధానాన్ని అవలంబించాము-అనే ప్రశ్నకు క్లుప్తంగా జవాబు చెప్పదలచుకొన్నాను. తీర్మానాన్ని మేము ఎందుకు వ్యతిరేకించలేదంటే-మహాత్మాగాంధిని, ఆయన అనుచరుల్ని, కాంగ్రెసులోనుంచి బయటికి తరిమివేయడానికి మేము ఏమాత్రం ఇష్టపడలేదు. ఎందువల్లనంటే, ఆ తీర్మానం ఓడిపోయినట్లయితే తప్పకుండా అదే జరిగియుండేది. అప్పుడు మన జాతీయోద్యమానికి ఎంత నష్టం వాటిల్లియుండేదో నేను ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ముఖ్యంగా దేశంలో బ్రహ్మాండమైన పోరాటం రాబోయే ఈ సమయంలో, మనం అంతా దేశం మొత్తంమీద త్వరలో బయద్దేరే స్వాతంత్ర్య పోరాటాన్ని గురించే తీవ్రంగా ఆలోచిస్తూన్న యీ సమయంలో, అట్టి ఘటనవల్ల వినాశకరమైన పరిస్థితులు ఏర్పడి యుండేవి. కాబట్టి. మనలోమనకు ఉండవలసిన ఐక్యత ఇదివరకటి కంటే ఎంత అవసరమో, ఎంత ప్రధానమో వేరే చెప్పనవసరం లేదు. కొన్ని కారణాలవల్ల పంతు తీర్మానాన్ని మేము అంగీకరించ నప్పటికీ, ఒకే పంథాను అవలంబించే వర్కింగ్ కమిటీకావాలి. అనే విపరీత సిద్ధాంతానికి ఆ తీర్మానంలో ఎక్కడా తావులేకుండా పోయింది. ఇది సంతసించవలసిన విషయం. అట్టి సిద్ధాంతాలను మేము అప్పటివరకూ విమర్శిస్తూనే వచ్చాం. కాంగ్రెసు సంస్థలో అట్టి సిద్ధాంతాలు చీలికలను కలిగిస్తాయని ఒకప్పుడు భావించబడింది.

### విశ్వాసరాహిత్యం కాదు.

పంతు తీర్మానాన్ని మేము వ్యతిరేకించకపోవడానికి మరొక కారణం కూడా ఉంది. ఆ తీర్మానంలో కాంగ్రెస్ అధ్యక్షుని మీద విశ్వాస రాహిత్యాన్ని ప్రకటించే అర్థం ఎక్కడాలేదు, అని స్పష్టముగా ప్రతి పాదకులు తెలియజేశారు.

### సంపూర్ణ విశ్వాసం.

ఆఖరి కారణం, అన్ని పరిస్థితుల్నీ మేము సాంతముగా పరిశీలించిన తరువాత, వేర్వేరు పెద్ద స్వరూపాలతో కనపడిన శక్తుల్ని మేము గుర్తించిన తరువాత, రాబోయే వర్కింగ్ కమిటీ గాంధీ మహాత్ముని సంపూర్ణ విశ్వాసాన్ని పొందియుండాలనీ; అప్పుడే కాంగ్రెసుకీ, జాతీయోద్యమాని కంతటికీ మంచిదనీ; గాంధీజీ అభీష్టం ప్రకారమే కొత్త వర్కింగ్ కమిటీ నియమించబడాలనీ—మేము దృఢమైన అభిప్రాయానికి వచ్చాం.

### తీర్మానాన్ని ఎందుకు బలపరచలేదు ?

పై తీర్మానాన్ని మేము ఎందుకు బలపరచలేదో కూడా తెలియజేస్తాను. ఆ తీర్మాన మందలి సిద్ధాంత సముదాయాన్నంతటినీ మేము అంగీకరించం. ఉదాహరణగా, స్వాతంత్ర్య పోరాటం వచ్చినప్పుడు గాంధీ మహాత్ము డొక్కడే మనకు జయాన్ని సంపాదించ గలడని మేము విశ్వసించడానికి సిద్ధంగాలేము.

### గాంధీవాదమా ? సామ్యవాదమా ? ఇది కాదు. ప్రశ్న

పై అభిప్రాయాలన్నింటినీ కలిపి ఆలోచిస్తే, ఆ తీర్మానంమీద తటస్థ విధానం అవలంబించడం తప్ప మరొక పంథా లేనేలేదు. తప్పు అభిప్రాయాలు మనస్సులలో నాటుకొనడంవల్లగాని, విరోధ భావంచే



జయప్రకాశ నారాయణ

ప్రోత్సహించబడటంవల్లగాని, కొందరు మాపై సోషలిజాన్ని గాంధీ వాదానికి అమ్మివేసినట్లు ఆరోపణలు గావిస్తున్నారు. పంతు తీర్మానాన్ని మేము బలపరచియున్నట్లయితే అట్టి ఆరోపణలలో న్యాయం ఉండేది. కాని, తీర్మానంలో మాచే అంగీకరించబడని సిద్ధాంత భేదాలు ఉన్నందువల్లనే మేము దాన్ని బలపరచజాలక పోయితిమని మేము స్పష్టంగా ప్రకటన గావించిన మీదట పై ఆరోపణలు ఆధార రహితములని చెప్పాలి, కాంగ్రెసులో ఐక్యత ఏర్పరచే ఉద్దేశం ఒక్కటే మా మనస్సులలో ప్రధానంగా ఉంది. ఆ ఉద్దేశంతోనే తటస్థంగా ఉన్నాం. దేశంయొక్క శ్రేయస్సుకొరకు మిగిలిన మార్గాలకంటే అదే ఉత్తమమైనదని నేను దృఢంగా నమ్ముతున్నాను. మరొక నిర్ణయం చీలికలను కలిగిస్తుంది. 'సెక్టేరియన్' పద్ధతి అని కూడా అనిపించుకొంటుంది. కాంగ్రెసు గాంధీ వాదాన్ని అవలంబించాలా, లేక సోషలిజాన్ని అవలంబించాలా ? అనేది ప్రస్తుత సమస్య కాదు. కాంగ్రెసులో చీలిక లేర్పడాలా, లేక ఐక్యత ఉండాలా? అనేదే అప్పటి అసలు సమస్య. నేటివరకూ ఆచరణలో ఉన్న ముఖ్య కాంగ్రెసు విధానాలకు భంగం వాటిల్లకుండా, కాంగ్రెసులో ఉన్న అన్ని ముఠాలవారూ స్వేచ్ఛగా పని చేసుకోవడానికి అవకాశం ఉండే ఐక్యతనే మేము అభిలషించాము. ముఖ్య విధానాలలో భంగం వాటిల్లాలని మేమెన్నడూ కోరియుండలేదు. మా ఉద్దేశం కూడా అదికాదు.

### విషయ నిర్ణయ సభలో వ్యతిరేకించిన దెందుకు ?

అయితే మేము పై అభిప్రాయాలను కలిగియున్నప్పుడు, ఆ తీర్మానాన్నే విషయ నిర్ణయ సభలో ఎందుకు వ్యతిరేకించామో చెప్పవలసియుంది. ఇది చాలా ప్రధానమైన ప్రశ్న. తిన్నని జవాబు ఈ ప్రశ్నకు చెప్పవలసియుంది. పై అభిప్రాయాలే నిజంగా మాకు ఉన్నప్పుడు, విషయ నిర్ణయ సభలో కూడా మేము తటస్థముగా ఉండి యుండవలసింది, కాని ఆ విధంగా మేం చేయలేదు. ఎందువల్ల ? కాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నికలో సుభాషబోసును మేము బలపరచాము. దాని ఫలితంగా సుభాసుబాబును బలపరుస్తూ రావలసిన అవస్థ పట్టింది. పైగా సుభాసుబాబును ఇతరులతోకూడ కలసి ఒక బ్లాకుగా పనిచేయవలసి వచ్చింది. ఆ ప్రధానమైన సమస్యలపై కాంగ్రెసు సంస్థ రెండు పరస్పర వ్యతిరేక ముఠాలుగా చీలిపోయి, ఒక్కొక్క ముఠాయొక్క బలాబలములు ప్రదర్శించడం హానికరమని మేము గుర్తించినప్పటికీ, ఆ ప్రవాహంలో మేము కూడా పడి కొట్టుకుపోతూ వస్తిమి. అంతేకాదు. తీర్మానంలో ఎట్టి మార్పులు చేయడానికి నాయకు లంగీకరించక పోవడంవల్ల మా మనస్సులలో బాధగాకూడ ఉంది. కాబట్టి. అన్నీ ఆలోచించిన తరువాత, తీర్మానానికి వ్యతిరేకంగా వోటు చేయడానికి నిశ్చయించుకొన్నాం. కాని, విషయ నిర్ణయ సభ అనంతరం కొన్ని ఘటనలు జరిగాయి. అవి మాలో మార్పును తీసుకొచ్చాయి. బహిరంగ సమావేశంలో తీర్మానాన్ని ఓడించే భారం మా మీద వేసుకొంటే, దేశానికి మిక్కిలి అరిష్టదాయకమని మేము అప్పుడు గ్రహించాము. "అతివాదులు" అనే పేరుతో కొందరు కాంగ్రెసును చిందరవందర చేయదలచుకొన్నట్లు స్పష్టముగా మేము చూచాం. అప్పుడు మేము తీర్మానాన్ని వ్యతిరేకించి యుంటే, తప్పకుండా వారి బలం వృద్ధి చెందేది. కాంగ్రెసులో ఐక్యతయొక్క అవసరాన్ని గురించీ, కాంగ్రెసులో గాంధీజీ ఉండి అత్యుత్తమమయిన రీతిని కార్యక్రమాన్ని కొనసాగించవలసిన అవసరాన్ని గురించి, మేము యిదివరకు కంటె ఎక్కువ చక్కగా గుర్తించాం. "జాతీయ వాంఛ"పై నేను ప్రతిపాదించిన తీర్మానాన్ని శరత్‌బాబు వ్యతిరేకించి నప్పుడు మా నిర్ణయం ఎంత సరియైనదో బోధపడింది. మా వాదనకు అప్పుడు బలం వచ్చింది. "అతివాద ముఠా" అని పిలువబడే వారి నాయకులలో ఒకడైన శరత్‌బాబుకు సీరియస్ రాజకీయ దృక్పథం లేనట్లు అందరికీ వెల్లడి అయింది. ఒక తీర్మానంపై ఆయనకూ—మాకూ మధ్య జరిగిన ఒడంబడిక వట్టి అబద్ధం అని శరత్‌బాబు పలికినప్పుడు మా వాదనకు బలం మరింత హెచ్చింది.

(మిగతా 22 వ పేజీలో)



# త్రిపురీ కాంగ్రెసు సమావేశము : కమ్యూనిస్టులు

## కామ్రేడ్ పి. సి. జోషి

[త్రిపురి నిర్ణయాలు. ఘటనలగూర్చి చర్చలు సాగుతున్నాయి. ప్రజాసామాన్యము, ముఖ్యముగా పార్టీ సభ్యులు. త్రిపురి విషయమై కమ్యూనిస్టుల దృక్పథమేమిటో, కాంగ్రెసు సోషలిస్టుల దృక్పథమేమిటో తెలుసుకోవడము అత్యవసరము. అందుచే కమ్యూనిస్టుల దృక్పథమును తెలియజేస్తూ కామ్రేడ్ జోషి వ్రాసిన వ్యాసాన్ని క్రింద ప్రకటించుచున్నాము. బ్రాకెట్టులలోనున్న విషయము. నేషనలు ఫ్రంటు సంపాదకీయము నుండి విషయ విశదీకరణానికి తీసి వ్రాయబడినది. వేరొకచోట కామ్రేడ్ జయప్రకాశ్ స్టేటుమెంటును పూర్తిగా ముద్రించి యున్నాము. —సంపాదకుడు.]

జాతీయైక్యత, ప్రజాపోరాటం, అనే నినాదాలతో మనమంతా త్రిపురీ కాంగ్రెసుకు వెళ్లాము. అయితే త్రిపురీలో జాతీయైక్యత ఎంతవరకు సమకూరింది ? ప్రజాపోరాటం ఎంతవరకు ముందుకు పోయింది ?

త్రిపురీ కాంగ్రెసు, చాల ముఖ్యమైన సమావేశము. బహుశా, ప్రపంచ యుద్ధం వచ్చే లోపల, ఇది ఆఖరు సమావేశమేమో కూడాను. ఫెడరేషనును ఈ సంవత్సరాఖరుకు మన నెత్తిమీదికి తెచ్చిపెట్టుతారు. ఈ లోపల కొద్దికాలం మాత్రమే మన ముందువుంది. ఈ వ్యవధిలోనే మనం, పునర్విమర్శన జేసుకోవాలి. తగిన ఏర్పాట్లు చేసుకోవాలి, మన సేనలను ముందుకు వెళ్లమని ఆజ్ఞలివ్వాలి. దేశమంతా త్రిపురీవైపు ఆతురతతో చూడ సాగింది, ఎందుకంటే త్రిపురీ నిర్ణయాలమీదనే మన భవిష్యత్తు ఆధారపడి ఉంది.

కాని, కాంగ్రెసులోనే, ప్రజలయొక్క ప్రధానసంస్థ (సుప్రీము సంస్థ) లోనే, ఐక్యత లేదు. నాయకత్వములోనే గొప్ప చీలిక ఏర్పడింది. దాదాపు వర్కింగు కమిటి అంతా రాజీనామా ఇచ్చింది. ఈసమయములో నాయకత్వము లేకపోయింది. నాయకత్వమునుండి ఎట్టి మార్గదర్శకత్వమూ లేకపోయింది. ప్రతినిధులలో అధిక సంఖ్యాకులు, త్రిపురికి, ఆతురతతో, నిర్ణయాల కెదురు చూస్తూ వెళ్ళారు.

అతివాదులు, తమ అభ్యర్థిని అధ్యక్షునిగా తిరిగి ఎన్నుకో గలిగారు. వారి సంతోషానికి మేరలేదు. కారణము, ఈఎన్నిక ఫలితంగా త్రిపురిలో ధైర్యంగా ముందుకు పొమ్మని స్పష్టమైన ఆజ్ఞ లివ్వబడు తాయని వారు ఆశించారు.

(బోసు ఎన్నిక తన సిద్ధాంతాలకు ఓటమి అని గాంధిజీ అన్నాడు. దానితో ఆరంభమయినది చర్చ. బోసు ఎన్నికలో ప్రధాన సమస్య బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వముపై వెనువెంటనే దాడికి ఏర్పాట్లుచేయుట. ఈ సమస్య ఈ చర్చలో మరుగపడ సాగింది.

పోరాటము ఆరంభించే కార్యక్రమముకోసం బోసువైపు అతివాదులందరూ చేరారు. దీనితో తమ నాయకత్వాన్ని త్రోసివేసి అతివాదులతోనే కూడిన వర్కింగుకమిటీని ఏర్పరచే ప్రయత్నాలివియని మితవాదులు కంగారుపడ్డారు.

అందుచే ఈచర్చలో రాజకీయాలను వెనక్కినెట్టి వ్యక్తిత్వము, నైతిక సమస్యలను ముందుకు తీసుకరావడానికి ప్రయత్నించారు.

కాని కమ్యూనిస్టులు పోరాటము ఆరంభించాలా అవసరములేదా అనేదే ప్రధాన సమస్య యని, ఈపోరాటము ఆరంభము కావాలంటే నాయకత్వములోని ఈచీలిక పోవాలనిఅన్నాడు. "జాతీయ రంగములోని వివిధశక్తుల మధ్య ప్రస్తుతమున్న తారతమ్యాన్ని ప్రతిబింబింపజేసే సంయుక్త నాయకత్వంకావాలి. ఒక జాయంటు (సంయుక్త) కార్యక్రమముతో పోరాటానికి ఏర్పాట్లు ఆరంభించాలి" ఇవి కమ్యూనిస్టుల నినాదాలు.)

త్రిపురిలో మొదటిరోజు గడిచెనో లేదో ఒక్క విషయము స్పష్టమయింది. డెలిగేట్లందరి మనస్సులలో నాయకత్వములోని చీలికను ఏవిధంగా పోగొట్టడమా యన్న ఆలోచనయే ప్రధానముగ ఉండినది. చీలిక పోనంతకాలము ఎట్టి కార్యక్రమముగాని, ఎట్టి విధానముగాని చర్చించనుకూడ సాధ్యముకాదు. అన్నిటికన్న ప్రధాన సమస్య; ఈ చీలికను పోగొట్టడానికి ఎవరు ముందుకు వస్తారు?



కమ్యూనిస్టు నాయకులు జోషీ, అధికారి

### ఐక్యతను తీసుకొనిరావాలి :

### అతివాదులు ముందుకు రాలేకపోయారు.

"చీలిక వచ్చేసింది. దీనిని పోగొట్టలేము. ఈచీలిక యుండక తప్పదనుకొని భవిష్యత్తు కార్యక్రమాన్ని నిర్ణయించుకోవాల"నే భావము అతివాదులలో కొందరిలో ఉండినది. జాతీయ అతివాద నాయకులలో ఎక్కువమంది అతివాదుల ప్రాబల్యముగల వర్కింగు కమిటీని ఏర్పరచాలనేవారే. కొంతమంది సోషలిస్టునాయకులు, ఇట్టి అతివాదుల వర్కింగు కమిటీలో సోషలిస్టులు అధిక సంఖ్యాకులుగాఉంటే తృప్తి జెందడానికి తయారు. రాజకీయ తీర్మానపు మసోదాలో అట్టిమేటము ఉండాలా అవసరము లేదా అని వారు చర్చించసాగారు. మేము అతివాద వర్కింగుకమిటీ నినాదాన్ని పూర్తిగా నిరాకరించి ఉంటిమి, దానిస్థానే సంయుక్త నాయకత్వము కావాలని కోరిఉంటిమి. దానినిపుడు ఆచరణలో పెట్టించాల్సిన పరిస్థితి ఏర్పడింది.

నాయకత్వములోని చీలికను బోసు ఒక్కపెట్టున పోగొట్టగలిగి ఉండేవాడు. వర్కింగుకమిటీ సభ్యులలో అధిక సంఖ్యాకుల యెడల తన నెప్పుడూ సందేహము లేదు. వారిసహకారము కావాలని. కలసి పనిచేయాలని హృదయపూర్వకముగాతెలియజేసియుంటే, నిస్సందేహంగాఅట్టి మనవి ఫలించి ఉండేది. అలాంటి ప్రకటనచేయమని మేము అతనిని మరిమరి కోరాము. అతని జబ్బులో అతడీవిషయమై చర్చించ లేకపోయాడు. అతనికి సలహాలు చెప్పు జాతీయ అతివాదులకు ఈ సూచన ఏ మాత్రము నచ్చలేదు. అది వారి పాక్షికోద్దేశాన్ని నాశనము గావించి యుండేది. అతివాదుల వర్కింగుకమిటీకావాలనే వారి ఎత్తును అది సాగనిచ్చేదికాదు. అందుచే వారు అట్టి సూచన అధ్యక్షుని ప్రతిష్టకు భంగకరమని త్రోసిపుచ్చారు.

ఇట్టి మహదవకాశాన్ని అల్పులు చేజారవిడిచారు. వారు తమ వ్యక్తిత్వాల గూర్చి ఆలోచించారేగాని ఉద్యమ గూర్చి ఆలోచించలేదు. వారు ఐక్య వ్యతిరేకించారు. ఫలితము గందరగోళ కడకిది అతివాదుల ఆపజయముతో, వాదులు చిందర వందర కావడముతో ముగిసింది

### పంతు తీర్మానము.

పంతు తీర్మానమును ఉపపాదించాడు. దాని ద్వారా ఐక్యతను తీసుకొనివచ్చే బాధ్యత మితవాదులు తీసుకొన్నారు అతివాదులు ఈతీర్మానముపై తమ్ము సమర్థించుకో వలసివచ్చింది. వారు విమర్శకులయ్యారు. ఐక్యతను నెలకొల్పే బాధ్యతను అవకాశమును జారవిడచారు. దీని ఫలితము. అతివాదులలోని చీలికలు పైకివచ్చాయి. తమలో తాము ఏకాభిప్రాయానికి రాజాలక పోయారు. దీనివలన మితవాదులకు, అతివాదులకు, చెందని సెంట్రిస్టు డెలిగేట్లమీద తమ పలుకుబడి పోగొట్టు కున్నారు. ఈసెంట్రిస్టు డెలిగేట్లందరూ,గందరగోళములో దిక్కుతోచక మునుపటి పద్ధతులనే బలపర్చారు

ముందటి నాయకత్వము తమ సహకారానికి ప్రథమ షరతు తమమీద విశ్వాసము ప్రకటించాలని పెట్టింది. నాయకత్వములో బోసు ఎన్నికకు పూర్వమున్న స్థితినే తిరిగి తేవడానికి వారి ఎత్తుఇది. గాంధిజీ వ్యక్తిత్వము చాటున ఐక్యత కావాలనే డెలిగేట్ల మనోభావాన్ని ఉపయోగించి తమ ఎత్తును నెరవేర్చ కోవాలను కున్నారు. సంయుక్త నాయకత్వను కావాలనే అతివాదుల నినాదాన్ని ఎదుర్కోడానికి ఇది యొక్కటియే వారికి మార్గము.

(బోసు మితవాదులు వ్యతిరేకించిననూ మితవాదులు అంగీకరించని కార్యక్రమాన్ని ముందుపెట్టి నెగ్గాడు. దీనివల్ల మితవాదుల ప్రతిష్ట కొంత భగ్నమయింది ఆప్రతిష్టను తిరిగి సంపాదించడమే పంతు తీర్మానముయొక్క ప్రధానోద్దేశము.

దీనికై బోసుమీద విశ్వాసరాహిత్య తీర్మానాన్ని తెచ్చి ఓటు చేయమని అడుగుటకు సాహసించలేక పోయారు. లేక కార్యక్రమానికి

... పెట్టారు. "ఒక్క కాసూకూడ మార్చమని" మితవాదులు భీష్మించి కూర్చున్నారు. "చిల్లి గవ్వనుకూడ రాబట్టుకోవాలని వారు పోరాడుతున్నార"ని ఒక అతివాద నాయకుడు విసుగుతో పలికాడు. బోసు ఒక ప్రకటన గావించాడు. అది చప్పగా ఉంది. దానిలో ప్రాణములేదు. అది ఎవరి హృదయాలను మార్చలేకపోయింది.

### సబ్జెక్టుకమిటీలో :

పంతు తీర్మానముపై చర్చ, ఆతురతతో ఎదురుచూస్తూ ఉన్న సభ్యుల ముందు ఆరంభమయింది. తీర్మానాన్ని బలపరుస్తూ గోవిందవల్లభపంతు ఒక మహోపన్యాస మిచ్చాడు:— అన్నిటికన్న ప్రధానమయినది, కాంగ్రెసు ఐక్యత. పోరాటము రాబోతుంది. ఈ సమయములో మన పూర్వపునాయకులమీద నిరాధారమగు అరోపణలు చేస్తే కాంగ్రెసు ఏవిధంగా తలయెత్తుకొని నిలబడగలదు? ఏ విధంగా మనము ముందుకు సాగగలము? మనలో ఐక్యతరావాలంటే ఒకరిమీద ఒకరికి విశ్వాసము కుదరాలంటే మనము పోరాటములో విజయము పొందాలంటే గాంధిజీనాయకత్వము అవసరము. కాంగ్రెసులో మితవాదులకూ, అతివాదులకూ,

అందరికి స్థానముంది. అందరికి ఉండాలికూడ. కాంగ్రెసు అధ్యక్షునిమీద ఇది విశ్వాసరాహిత్యము కానేకాదు. ఆ ప్రశ్నే రాలేదు. అందరూకలసి పని చేయాలి. కాని దానికోసం మొదట ఈ విషపూరిత వాతావరణాన్ని తొలగించాలి.

ఈ ఉపన్యాసము సభ్యులందరిని శ్రోతలందరిని కదల్చివేసింది. కాని నాయకులకు ఇది రుచించలేదు. వారి ధ్యత్పివాస్న పంతు ఉపన్యాసము వెల్లడించలేదు.

అతివాదులలోని లోపాలన్ని వారి ఉపన్యాసాలలో ప్రతిధ్వనించాయి. ఈ సమయములో ఎక్కువ రాజకీయానుభవము లేనిదో తెల్పుట ప్రమాదాలు తెల్పును. కమ్యూనిస్టు ప్రతినిధుల నాయకుడు కామ్రేడ్ భరద్వాజ్ ప్రతివాని దృష్టిని ఆకర్షించే ఉపన్యాస మిచ్చాడు. కమ్యూనిస్టులు, సోషలిస్టులు కాంగ్రెసు ఐక్యత కోసం ఇంతవరకు పనిచేస్తూవచ్చారు. ఇప్పుడూ పనిచేస్తూనే ఉన్నారు. ఈతీర్మానము అతివాదులను కాంగ్రెసులో అణచివేయడానికా, కాంగ్రెసునుండి నెట్టడానికా అని అనుమానము కలుగుతూఉంది. పంతు ఉపన్యాసములోని

అతని ఉపన్యాసము కొంత గందరగోళము మాత్రము కలిగించింది. ఎక్కువప్రమాదమేమీ కలిగించలేదు. ఎందుకంటే రాయి కాంగ్రెసు పని చేయడానికన్నా, రాయిజమును వ్యాపింపజేయుటకే ఎక్కువ ఆతురత కల్గి ఉన్నాడని ఈపాటికి కాంగ్రెసువారు అందరికీ తెలిసిపోవడమే.

కాంగ్రెసు సోషలిస్టు ఉపన్యాసకులలో ఎక్కువమంది సమస్యను స్పష్టపరచడానికి బదులు, మరింత గందరగోళము చేయడానికే పనికివచ్చారు. లోహియా మాట్లాడాడు. నాప్రక్కన కూర్చొనియున్న కొంతమంది రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీనాయకులు దిగ్భ్రమ చెందారు. "తీర్మానానికి అనుకూలంగా మాట్లాడుతున్నారా? లేక వ్యతిరేకంగా మాట్లాడుతున్నారా?" అని నన్ను ప్రశ్నించారు.

సోషలిస్టుల నాయకుడు నరేంద్రదేవుజీ ఈ పొరపాటులనన్నిటిని, అసలు విషయానికి సంబంధములేని ఈ అవకతవకల నన్నింటిని త్రోసిపుచ్చి, ప్రతినిధుల ముందు ప్రధాన సమస్యను పెడతాడని ఆశించాము. అతనికి సహజ

కోలు అన్నాడు మితవాద నాయకులు తిరుగుబాటుచేశారు వారిని మనము విచారిస్తున్నట్లు మాట్లాడాడు. త్రిపురీ సమావేశములోకెల్ల ఎక్కువ నిస్తేజమైన ఉపన్యాసము ఇదే. ఉపన్యాసమందలి విషయాన్ని చూచినా, ఆ ఉపన్యాసమిచ్చే ధోరణిజూచినా ఈ భావనే బలపడుతూఉంది. అతడు తన కోపాన్నంతా సామ్రాజ్యవాదము మొదలగాక మితవాదుల యందు వెళ్ళగ్రక్కాడు. ఐక్యతకోసం, నాయకులను కోరవలసిన సమయములో, ప్రార్థించవలసిన సమయములో, నాయకత్వము మొదలవిషాన్ని వెళ్ళగ్రక్కాడు. వాళ్ళను తిట్టాడు. ఏమీతెలియని ప్రజాసామాన్యము మెచ్చుకో దానికి పనికివచ్చే ఉపన్యాసములోవలె ప్రజా తంత్రాన్నిగూర్చి మాట్లాడాడు. సంయుక్తనాయకత్వము ద్వారానే ఈవిషమపరిస్థితిని దాటుటకు సాధ్యమగునన్న సంగతి మరిచిపోయాడు. అసంయుక్త నాయకత్వాన్నే భగ్నము గావించ దానికి అతడు చేయగలిగినదంతా అతని ఉపన్యాసముద్వారా చేశాడు. ఇంతకన్న బాధ్యతారహితమైన ఐక్యతా విచ్ఛేదకమయిన ఉపన్యా

ముగోనే ఉంది. ఆచిలికను క్రింది సంఘాలలో కూడ, కాంగ్రెసు సభ్యులలోకూడ కలుగజేయవద్దు.

## అతివాదులు అపజయానికి కారణాలు.

మితవాదులయొక్క హ్రస్వదృష్టి, ఒక్క సవరణనుగూడ వారు అంగీకరించక పోవడం, అతివాదులలో చర్చ సందర్భమున కనపడిన రాజకీయ భేదాభిప్రాయాలుండినా అతివాదుల నందరిని ఒకటిగా చేయడానికి తోడ్పడ్డాయి. అది ఒక మహా పరీక్ష సమయము. ముందుకు అప్పుడప్పుడే వస్తూ ఉన్న అతివాదులు దేశాన్ని ఐక్యపరచి, దానిగమ్యస్థానానికి తీసుకుపోగలరాఅనే పరీక్షలో అతివాదులు పూర్తిగా విఫలులయ్యారు. దేశ ప్రజలలోని సందేహాలను భయాలను తొలగించలేదు. మునుపటి కన్న ఎక్కువ విశ్వాసమును సంపాదించలేదు. ఎక్కువ బలాన్ని సంపాదించలేదు. ఇవి చేయక్క పోతే పోనీ కనీసము ఆశించిన హద్దువరకు కూడ రాజాలకపోయారు. అతివాదుల తరపున మాట్లాడినవారిలో భరద్వాజ్, కొంతవరకు జయప్రకాశ్ తప్ప మరెవ్వరూ పోరాటానికి.



సుభాసుబాబును అధ్యక్షత వహించడానికి స్ట్రెచరుమీద తీసుకవచ్చారు.



కమ్యూనిస్టు నాయకుడు, కామ్రేడ్ భరద్వాజ్ సబ్జెక్టు కమిటీలో సవరణను ప్రతిపాదిస్తున్నాడు.

భావాలు, ఈతీర్మానములో లేవు. ఉద్యమానికి కావలసినది ఒకగ్రూపు తన పూర్తినాయకత్వం మరియొక గ్రూపుపై చలాయించడము కాదు. గాంధిజీ గైడన్సు (నాయకత్వము) క్రింద సంయుక్త నాయకత్వమే ఉద్యమాభివృద్ధికి తోడ్పడుతుంది. సంయుక్త పోరాటానికి కావాలసిన సంయుక్త నాయకత్వాన్ని రానివ్వకుండా జేయడానికే గాంధిజీ పేరును తీర్మానములో తీసుకవచ్చారు.

జాతీయ అతివాద నాయకుల ఉపన్యాసాలు పేలవములుగా ఉన్నాయి. మితవాదులకన్న చర్చలో తామే గొప్పవారనిపించుకోడానికి మాత్రమే వారుపన్యాసాలిచ్చారు. పోరాటాన్ని గూర్చి వారి ఉపన్యాసాల్లో ఏమీలేదు. ఈ గంభీర విషమ పరిస్థితియందు కూడ విమర్శించే అలవాటును వారు మానలేదు. అతివాదులు కాని మిగిలిన డెలిగేట్లందరూ వీరి ఉపన్యాసాలు విన్నపిదప, వీరిచేతుల్లో కాంగ్రెసు సురక్షితంగా ఉంటుందా? అని సందేహించారు.

వీరిలో రాయి అందరికన్న మరీ దూరము వెళ్లాడు. గాంధిజీయా లేక బోసా అన్న ప్రశ్నను తెచ్చాడు. కాంగ్రెసుయొక్క మూల కార్యక్రమాన్నే మార్చాలన్నాడు. అయితే

మయిన రీతినే అనర్గళధారతో మరియొక ఉపన్యాసమిచ్చాడు. ఈ ఉపన్యాసములో నరేంద్రదేవుజీసూచించిన సూత్రాలనువిని, తమ్మికర్రతో పొడిచినట్లు అతివాదులు బాధపడ్డారు. "మితవాదులులేరు, అతివాదులులేరు........ మితవాదులనబడేవారు అతివాదులనబడేవారు అందరూ సామ్రాజ్యవాద వ్యతిరేకులే. జాతీయ విప్లవము పూర్తియైన పిమ్మట సోషలిస్టు విప్లవముకోసం మనము పోరాటము ఆరంభించినపుడే, నేడు మితవాదులనబడేవారు నిజంగా మితవాదులవుతారు." నాప్రక్కనే కూర్చొనివున్న ఒక ప్రతినిధి తనంతగనే "అట్లయితే తీర్మానాన్ని వ్యతిరేకిస్తూ ఎందుకు మనము మాట్లాడుతున్నాము?" అని అరిచాడు. తాడుమారవుతూఉన్న వాతావరణములో జాతీయ అతివాదనాయకుల ఉపన్యాసా లెంత కోపాన్నికల్గించినా; మూలపదాలకు, సూత్రాలకు క్రొత్త అర్థాలుచెప్పడము, ఎదుర్కొనవలసిన క్లిష్టసమస్యను మామూలు విషయములాగ పరిగణించడము, అతివాదులలోని నిస్తేజమును దృక్పథాన్ని ఖండించుటకు మాదు దానిని పెంపొందించింది.

నిహరేందు దత్తమజుందారు, కాంగ్రెసు మితవాదనాయకులు భారతదేశములోని ప్రాం

సము మరొకదానిని ఎవరూ ఊహించజాలరు. కమ్యూనిస్టుల దృక్పథాన్ని సరిగా భరద్వాజ్ తెలియజేస్తున్నాడా లేక దత్తమజుందారు తెలియజేస్తున్నాడా? అని సోషలిస్టులలోని సోషలిస్టు ఐక్యతకు ప్రతికూలురైన వ్యక్తులు ప్రశ్నించసాగారు. మన పోరాటానికి మన ఉద్దేశానికి దత్తమజుందారుకన్న ఎక్కువ నష్టము మరే కామ్రేడైనా కలిగించడము ఊహించజాలము.

అష్రఫ్ ఉపన్యాసము అందరి ఉపన్యాసాలకన్న బాగుంది అనర్గళంగా ఉంది. అందరిని ఐక్యతకొరకు పనిచేయమని ప్రోత్సాహిస్తూ కూడ ఉంది:—అందరు కోరే ఐక్యతకు మార్గము ఈలాంటి తీర్మానంకాదు మాయొక్క సహేతుకములైన సవరణలు అంగీకరించండి. అందరు ఏకగ్రీవముగా తీర్మానాన్ని ప్యాసు చేయుటకు అవకాశము కలుగజేయండి. గాంధిజీని ఓటుకు పెట్టవద్దు. కాంగ్రెసును విచ్ఛిన్నం గావించడానికి ప్రయత్నించే శక్తులను, ముఖ్యముగా కులతత్వ శక్తులను, ఎదుర్కొని నాశనం గావించడానికి ఐక్యత అవసరము. సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించడానికి ఒక యుద్ధ కార్యక్రమము మనకు ఉండాలి, మాకు అట్టి కార్యక్రమము ఇవ్వండి. చీలిక కేవలము నాయకత్వ

ఐక్యతకు గల సంబంధాన్ని తెలియజేయలేక పోయారు. భరద్వాజ్ కూడ కాంగ్రెసులోని ఈ విషమస్థితికి గల రాజకీయ కారణాలను విశదీకరించలేదు.

మునుపటి వర్కింగు కమిటీ అవలంబించిన డ్రిఫ్టు విధానమే ప్రస్తుతము ఈ సమస్యను ఏవిధంగా తెచ్చిపెట్టిందో వివరించి యుండవలసినది. డ్రిఫ్టు విధానము అంటే పరిస్థితులు, ఘటనలు రానీ, చూచుకోవచ్చులే అని ఫెడరేషనుకు వ్యతిరేకంగా ఎట్టి నిశ్చిత కార్యక్రమమును నిర్ణయించకుండడము. ఈ విధానమును మాని, ముందుకు సాగు విధానమును అవలంబించడానికీ, సంయుక్త నాయకత్వము కావాలి. అందు మునుపటి వర్కింగు కమిటీ సభ్యులుకూడ ఉండాలి. అధ్యక్ష ఎన్నికల పిదప పరిస్థితులు చాల త్వరితముగా మారాయి. అవి అతివాదులందరికి క్రొత్త. వానిని గూర్చి అతివాదులకు తగిన పరిజ్ఞానము కలిగించి



యుండవలసినది. అది చేయజాలక పోయాము.

అతివాదనాయకులు, ఎక్కువభాగము మితవాద నాయకులు తమదృక్పథము మాని, ఐక్యతనంగీకరించునట్లు చేయడానికి వారి నుద్దేశించే మాట్లాడారు. లేదా అతివాదులు ఐక్యతకోసం చేసే ప్రయత్నాలను అపనమ్మకముతో జూచే సెంట్రిస్టు డెలిగేట్ల సందేహాలు పోగొట్టి తమ దృక్పథము ననుసరించిన ఐక్యతను వారుకూడ బలపర్చునట్లు చేయుటకు ఉపన్యాసాలిచ్చారు. కాని ఐక్యత నెలకొల్పడము అతివాదుల ప్రత్యేకబాధ్యత అని అతివాదులకు తెలియజేయడానికి ఉపన్యాసాలలో ప్రయత్నించలేదు. అంతకు మునుపు అతివాదులకు తగిన పరిజ్ఞానము ఇవ్వలేకపోయినపుడు, ఉపన్యాసాలలోని ఈలోపము చాలప్రమాదస్థితిని తీసుకొని వచ్చుటకు కారణమయింది.

అంతేగాక, గాంధిజీ నాయకత్వమును మనమెందుకు బలపరచినదీ స్పష్టపరుచబడలేదు. పదవి స్వీకరణము మొదలు నేటివరకు గాంధిజీ సూచిస్తూఉన్న విధానముపై మనము ఇంతవరకుచేసిన విమర్శనను తప్పుఅని మార్చుకుంటిమా? లేదు! మనము మన విమర్శనను మానలేదు. కాని మనము త్రిపురి ఒక అడుగు ముందుకువేయాలని కోరాము. త్వరలో దేశవ్యాపక పోరాటము ఆరంభించుటకు త్రిపురీ కాంగ్రెసు నిర్ణయించాలనికోరాము. ప్రజాసామాన్యమందు అత్యధిక విశ్వాసాన్ని రగుల్కొల్పగల ఒక్క వ్యక్తి గాంధిజీ. అందుచే అతని సహకారము, నాయకత్వముగల సంయుక్త వర్కింగు కమిటీ అట్టి పోరాటానికి సన్నాహాలు గావించడానికి అత్యధిక బలము కలిగి యుండును. గాంధీజీ నాయకత్వానికి ఓటు చేయుటకు ఇదియే కారణము.

అతివాదనాయకులు తమ వైఖరిని విశదీకరిస్తూ దానికిగల రాజకీయ కారణాలను స్పష్టముగా తెలియజేయలేదు. క్రొత్త వైఖరికి కారణాలు:

1. తాము పోరాటాన్ని నిస్సందేహముగా కోరుతున్నారు. పోరాటాన్ని వేళకోళముగా తాము పరిగణించడము లేదు. దానికోసం తీవ్రంగా కృషిచేయుచున్నారు.

2. అందుచేతనే స్వాతంత్ర్య శక్తులను విడదీయునట్టి మూలసిద్ధాంత సమస్యలను చర్చకు తీసుకొని రాకుండుటకే తాము ప్రయత్నించారు.

3. ఇది సోషలిస్టు సిద్ధాంతాలనుబట్టి చూస్తే సరియైన పద్ధతియే. ఎందుకంటే సోషలిజము సర్వకాల సర్వావస్థలందు అనుసరించుటకు శాశ్వతముగా నిర్ణయించిన ఒక కార్యక్రమముగాదు. అది విప్లవానుభవమువలన యదార్థస్థితిని గ్రహించి దాని ననుసరించి కార్యక్రమమును నిర్ణయించుకోవడము. అట్టి విప్లవానుభవము బట్టిచూస్తే ప్రస్తుత పరిస్థితులలో తమ ప్రస్తుత కార్యక్రమము తమ ప్రస్తుత వైఖరి సరియైనవి.

ఈ కారణాలు విశదీకరించ జాలకపోవుటచే సోషలిస్టులు కానివారు, అతివాదనాయకులు తాముచెప్పేది నిజంగా, ఉద్దేశించే,చెప్పుతున్నారా లేక బూటకమా అని అనుమానించారు. సోషలిస్టుపార్టీలలోని సామాన్యసభ్యులు తమనాయకులు కంగారు పడ్డారని అనుకున్నారు.

వోటింగు జరుగకముందు సబ్జెక్టు కమిటీ సమావేశాల మధ్య ఉండు తీరిక సమయములో తీవ్ర ఓట్ల ప్రచారముసాగింది. రాజేంద్రబాబు, భూలాభాయి డెలిగేట్ల గదులకు వెళ్లారు. మంత్రులు, పార్లమెంటరీ కార్యదర్శులు డెలిగేట్లను వ్యక్తిగతంగా చూచి కాన్వాసుచేశారు. వారి అనుచరులకుదారి మిన్నుకనబడలేదు. గాంధికావాలా? బోసు కావాలా? అహింసా పద్ధతి కావాలా? దౌర్జన్య పద్ధతికావాలా? గాంధివాదము కావాలా? సోషలిజము కావాలా? ఇది వారి ప్రచారము.

యం. యన్. రాయికి, జాతీయ అతివాద నాయకులకు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు బలపర్చునపుడు వచ్చిన కొద్దిఓట్లు, అతివాదుల పేరుతోనైనా వెనుకముందు ఆలోచించుకొనని కార్యక్రమాన్ని పెట్టినచో దానికి అత్యధిక సం

జాయింటుగా ఒక తీర్మానాన్ని తయారుచేశారు. ఈ తీర్మానాన్ని జాతీయ అతివాదులు అంగీకరించునట్లు జేయుటకు, వారి అల్టిమేటము నినాదాన్ని మానుకొనునట్లు చేయుటకు చాల కష్టమయింది. ఒక కాల నిర్ణయముగల నిజమైన అల్టిమేటమును కాంగ్రెసంతయూ ఐక్యకంఠముతో అంగీకరిస్తేనే, ఇవ్వడానికి సాధ్యమవుతుంది, అల్టిమేటము నివ్వడానికి కొంతమంది అంగీకరించనపుడు, దానిని తీర్మానములో ఒక భాగముగా ఉంచడము స్వాతంత్ర్య పోరాటములో పాల్గొనవలసియుండు శక్తులలో చీలిక తేవడమే. పోరాటము కోసమని ఇట్టి చీలిక తెచ్చినచో పోరాటాన్ని సాగించలేము. అందుచే అవలంబించవలసిన మార్గమొక్కటియే మిగిలింది. పోరాటము తప్పకుండా వచ్చునట్లుచేయుటకు, స్వాతంత్ర్య శక్తులను ఐక్యమొనర్చి, అవి ముందుకు సాగునట్లు చేయడమే. వెంటనే చేయవలసిన పనినిగూర్చి ఒక నిర్ణయానికి రండి. కాంగ్రెస్సంతటిచే దానిని అంగీకరింపజేయండి. అదే నిజమైన పోరాటానికి దారి తీస్తుంది. అల్టిమేటము నినాదముయొక్క ఉద్దే

పోరాటము" అనే శబ్దము స్పష్టముగాలేదు. ఆచరణకు సంబంధములేనిరీతిగ పోరాటాన్ని గూర్చి నేడు మనము చర్చించలేము. ప్రతి రోజూ అనేక స్థానికపోరాటాలు బయలుదేరుతున్నాయి. ఈపోరాటాల నుండి ముందడుగు దేశవ్యాపక పోరాటమే. మెహరల్లీ ఇట్టి సవరణను ప్రతిపాదించాడు. అంతేగాక, "దేశవ్యాపక పోరాటము" అనే పదాలు సరిపోవు. కాంగ్రెసు ఈవరకు తీర్మానాలు చాల ప్యాసుచేసింది. వానిని అమలులో పెట్టలేదు. నాయకత్వములోని డ్రిఫ్టు విధానము, కాంగ్రెసు క్రింది సంఘాలలోను, సామాన్య సభ్యులలోను స్తబ్దతతెచ్చింది. దేశవ్యాపక పోరాటానికోసం అవసరమయిన సన్నాహాలను తెలియజేస్తే ఒక కార్యక్రమము అత్యవసరము. మెహరల్లీ సవరణ అట్టి కార్యక్రమాన్నికూడ సూచించింది. దానికి ఎవరూ అభ్యంతరమూ చెప్పడానికి వీలులేదు.

నెహ్రూ దేశవ్యాపక పోరాటానికి సంబంధించినంతవరకు సవరణను అంగీకరించాడు. కార్యక్రమమును అంగీకరించలేదు. మెహరల్లీ కమ్యూనిస్టుల సలహా తీసుకొనకయే సవరణ



52 ఏనుగులతో ఈడ్వబడిన రథములో అధ్యక్షుని ఊరేగింపు!

సుభాసుకు జ్వరము ఎక్కువగా ఉండుటచే ఆయన పటాన్ని పెట్టి ఉత్సవము సాగించారు.

ఖ్యాకులు పూర్తిగా వ్యతిరేకము అన్న సంగతి స్పష్టముచేశాయి. అసలు తీర్మానమునకు 218 ఓట్లు అనుకూలంగావచ్చాయి 135 ఓట్లు వ్యతిరేకంగావచ్చాయి. సంయుక్త అతివాద పక్షాలకు అది గమనించవలసిన విజయము. ఎందుకంటే మితవాదులు గాంధిజీని ఓటుకుపెట్టినాకూడ, గాంధిజీనాయకత్వము మీద విశ్వాసముందా అనే ప్రశ్నను తెచ్చినా కూడ, అతివాదులకు 135 ఓట్లు రావడము గొప్ప విషయమే.

అతివాదులు అపజయము పొందారు. కాని నిరుత్సాహపడలేదు. మహా సమావేశములో గెలవడానికి మంచి అవకాశముంది. రాజకీయ తీర్మానము విషయమై మరింత అవకాశముంది. దానికోసం ప్రత్యేక శ్రద్ధ వహిస్తామని సోషలిస్టు కమ్యూనిస్టునాయకులు తలచారు.

## నేషనలు డిమాండు తీర్మానము.

త్రిపురిలో కాంగ్రెసు ఐక్యతను గూర్చి అందరూ ఆతురతపడ్డారు. కాని, సామ్రాజ్యవాదముపై పోరాటానికి అనుజ్ఞ పొందాలని అందరూ ఆశించారు. సోషలిస్టులు, కమ్యూనిస్టులు తమ తమ వేరు వేరు చిత్తు తీర్మానాలను పరిశీలించి,

శముకూడ నిజమైన పోరాటమే అయినపుడీ పద్ధతిని అవలంబించడానికి అడ్డుయుండ రాదు.

సోషలిస్టులము, కమ్యూనిస్టులము కలసి తయారుచేసిన తీర్మానాన్ని జవహర్‌లాల్ నెహ్రూతో అతడు తన నేషనల్ డిమాండు తీర్మానాన్ని తయారు చేస్తున్నప్పుడు చర్చించాము. సబ్జెక్టు కమిటీలో తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ తన ఉపన్యాసములో జాతీయ పోరాటము త్వరలో వస్తుందని చెప్పాడు. ఉపన్యాసము విషయానికి తగినట్లు గంభీరముగ ఉంది. అంతులేని చర్చలలో మునిగిపోతున్న ప్రతినిధులకు, మార్గము (వెల్తురు) కనపడింది. జాతీయ ఆదర్శాన్ని, రాజీపడగోరువారికి అవకాశములేని రీతిని తిరిగి స్పష్టముగా తెలియజేసింది. కాన్స్టిట్యుయంటు అస్సెంబ్లీద్వారా స్వయంనిర్ణయ హక్కును మరియొక పర్యాయము చాటింది. ఫెడరేషనును అమలులోకి తెచ్చినా, లేకపోయినా దానితో సంబంధములేకనే, ఈ స్వయం నిర్ణయసూత్రాన్ని వెంటనే అమలు జరుపాలని కోరింది.

నెహ్రూ చిత్తు తీర్మానములో "దేశవ్యాపక

ఉపసంహరించుకొన్నాడు. ఇది పొరపాటు. ఎందుకంటే ఆపాటికి అందరూ అలసిపోయినా త్రిపురికి కాంగ్రెసులోని ముఖ్యులందరు వచ్చి యుండుటచే బహిరంగ మహాసమావేశములో కార్యక్రమాన్ని విశదీకరించుట చాలా అవసరము. అందు ఆ కార్యక్రమము ప్యాసు అయి ఉండేది. ఒకవేళ కాకపోయినా ఈ రీతిగా విశదీకరించడమువల్లనే త్రిపురీలో సమావేశమయిన వివిధ స్థానిక నాయకులను పోరాటసన్నాహాలను త్వరలో ముగించునట్లు ప్రోత్సాహపరచగలము.

## బహిరంగ సమావేశములో

(ఆరోజు ప్రతినిధుల క్యాంపులలో శరత్ బోసు, బహిరంగ సమావేశములో అల్లరి చేయించి కాంగ్రెసును నడువనివ్వకుండా చేయడానికి చూస్తున్నాడని ఒక కరపత్రము పంచిపెట్టబడింది.) ఈ పరిస్థితిలో ప్రతినిధులు మహా ఆందోళనతో సమావేశమయ్యారు. గాంధిజీపైనా వర్కింగుకమిటీపైనా విశ్వాసాన్ని తెలియజేసే తీర్మానము ఏమౌతుంది? అని అందరూ ఆతురపడసాగారు, అధ్యక్షతవహిస్తూ

ఉన్న మౌలానా అజాద్, అధ్యక్షుని జబ్బు మరింత ఎక్కువయిందని డాక్టర్ల రిపోర్టు చదివాడు. అనే అఖిలభారత కమిటీకి, ఫరిష్కరించమని తీర్మానాన్ని పంపించాలి, అని ఉపపాదించాడు. ఇది పనికిరాదని కొందరు అసమ్మతి తెల్లియజేశారు. వోట్లు తీసుకోబడ్డాయి. అనే తీర్మానము ప్యాసయిందని అధ్యక్షుడు ప్రకటించాడు. ఓట్లను లెక్కించమని కోరారు. అధ్యక్షుడు ఏమి నిర్ణయము ఇవ్వక వెనుక ముందు చూడసాగాడు. ఈ లోపలనే, అసలు విషయాన్ని ప్రస్తుతము చర్చించవద్దని నారిమన్ అడ్జోర్నమెంటు ప్రతిపాదించాడనీ అది త్రోసివేయబడిందనీ, ఈ విషయము బహిరంగంగా ప్రకటించనైనా ప్రకటించలేదనీ ప్రతినిధులకు తెలిసింది. కోపము, ఆవేశము పెరుగజొచ్చాయి. ఈ విషమదశయందు కొద్దిమంది ప్రతినిధులు వేదికవైపుకు దుమికారు. కాని దారిలో ఆపు చేయబడ్డారు. ఈ కొద్దిమంది రాష్ట్రీయావేశాలకు గురియై, హద్దుమీరిపోయారు. దీని ఫలితము? ఇది మితవాదులు ఎదురుచూస్తూ ఉండిన అవకాశము వారికి కలుగ జేసింది.

ఈ ప్రదర్శనము మహా హానికరంగా పరిణమించింది. అతివాదులను బలపరుస్తూ ఉండిన అనేకమంది ప్రతినిధులు పూర్తిగా మితవాదుల వైపుకు వెళ్ళిపోయారు. ఇంతవరకు విచ్ఛేదము మితవాదులనుండి మాత్రము వచ్చేది. ఈ ప్రదర్శనము, విచ్ఛేదము అతివాదులనుండి కూడ రాగలదని ప్రతినిధులకు నమ్మకముకలుగ జేసినది.

డబ్బుతీసుకొన్న కొందరు వార్తా ఏజెంట్లు. ఈ ప్రదర్శనమును కమ్యూనిస్టులు ఏర్పాటు చేశారని ప్రకటించారు. ఈఘటన జరిగిన వెంటనే జయప్రకాశ్ సోషలిస్టుల తరఫున. కమ్యూనిస్టుల తరఫున దీనిని ఖండిస్తూ మాట్లాడాడు. కమ్యూనిస్టులకు ఈప్రదర్శనముతో ఎట్టి సంబంధములేదని భరద్వాజ్ వెండుపద్యాయాలు మాట్లాడాడు. నిజానికి, మా కమ్యూనిస్టులు ప్రతినిధులను, వారివారి బ్లాకులలోకి తీసుకరావడానికి తమ శక్తికొలది ప్రయత్నించారు. మరికొంతమంది కామ్రేడ్సు ఇంకా ఇతర డెలిగేట్లు తమ స్థానాలనువదిలి ఈ ప్రదర్శనములో జేరకుండా జూచారు. అయితే వార్తా విలేఖరుల ఈకథ సోషలిస్టు ఐక్యతను భగ్నం గావించడానికి. కాంగ్రెసువారి దృక్పధములో కమ్యూనిస్టులను అప్రతిష్ట గావించడానికి అవసరము. కాని ఈయెత్తులనుచూచి ఎవరూ మోసపోరు.

ఈలాగు $1\frac{1}{2}$ గంట ప్రదర్శనము జరిగిన పిదప నెహ్రూ, ఈఘటనను ఖండిస్తూ మాట్లాడాడు. అఖండనను ప్రతివ్యక్తీ బలపరిచాడు. ఖండింపడానికి నెహ్రూ ఉపయోగించిన పదాలకు హర్షాన్ని తెలియజేశారు.

ఒక అపర్యూనిస్టు ఉపన్యాసము.

శరత్‌బోసు "అర్జిమేటము ఇవ్వాలి" అనే సవరణను సకాలములో ఇవ్వలేదు. అందుచే అసలు తీర్మానానికే వ్యతిరేకంగా మాట్లాడాడు. అతని ఉపన్యాసము అందరికే ఆశ్చర్యముకలుగ జేసింది. అతివాద పదజాలము క్రింద మరుగు పడితున్న పూర్తి మితవాద తత్వముకాక అది మరేమీకాదు. ఈ ఉపన్యాసము అతివాదులను, డెలిగేట్ల సమక్షన ఒకబాంబువలె నాశనము గావించింది. ఆ బాంబు అతివాదులనుండియే వచ్చింది.

కామ్రేడ్ జయప్రకాశ్, త్రిపురీ సమావేశములోకెల్లా గొప్పదైన మహోపన్యాసము నేషనలు డిమాండు తీర్మానాన్ని బలపరుస్తూ ఇచ్చాడు. ఐక్యత, పోరాటము ఆ ఉపన్యాసములో ప్రతిధ్వనించాయి. సోషలిస్టులతోను, కమ్యూనిస్టులతోను ఈ తీర్మానములో అర్జిమేటమును మానివేయడానికి ముందు శరత్‌బోసు అంగీకరించాడన్న విషయాన్ని తెలియజేశాడు. శరత్, పేరుకు అతివాదిగా ఉండి అతివాదుల బలాన్ని సమూలంగా నాశనం గావించాడని ప్రకటించాడు.

నెహ్రూ తీవ్రవ్యంగ్యోక్తులతో శరత్‌బోసు ఉపన్యాసాన్ని ఖండించాడు. కాంగ్రెసు సభయంతటినుండి హర్షధ్వనులు నెహ్రూ ఉపన్యసిస్తూ ఉన్నప్పుడు చెలరేగాయి. ఇదియొక్కటే అతివాదులకు పాక్షిక దృక్పధములేదని రుజువు చేస్తుంది. ఈవిషయమునే ఈ తీర్మానముపై జరిగిన వోటింగుకూడ రుజువుచేసింది. బెంగాలునుండి వచ్చిన ఒక్క అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యుడు కూడ శరత్‌బోసుతో కలసి తీర్మానానికి వ్యతిరేకముగా ఓటుచేయలేదు డెలిగేట్లనుండి 20 ఓట్లకు మించి శరత్‌బోసుకురాలేదు. అయినా, అతివాదులు బలపరుస్తూ ఉన్న అధ్యక్షుని తలంపులు, శరత్‌బోసు తెలియజేస్తున్నాడని అందరూ అనుకొనేవారు. అందుచే ఇతని ఈచర్య, సభకు హాజరుకాలేని అధ్యక్షుని ప్రతిష్టకు నష్టము కలిగించింది.

అతివాదుల ఐక్యత భగ్నమయింది.

(ఈప్రదర్శనము, పైకి అతివాద దృక్పధము కలిగియున్నట్లగు పడినను నిజానికి శరత్‌బోసు యొక్క అపర్యూనిస్టు దృక్పధము; నాలుగు రోజులుగా త్రిపురిలో, మహాఓర్పుతో నిర్మించబడిన ఐక్యతను భగ్నము గావించింది. అతివాదులలో కొందరు ఈప్రదర్శనాన్ని సమర్ధించి, మితవాదులపై దుముకడానికి తయారు. మరికొందరు మహాకంగారులో, పంతు తీర్మానమును వ్యతిరేకించడము మాని, బలపర్చుటకు తయారు. కాని అతివాదులకు కేంద్రము సోషలిస్టులు కమ్యూనిస్టులు. వీరు ఈగందర గోళములో తమ్ము తాము మరచి పోలేదు. వారు ప్రదర్శనముతో తమకెట్టి సంబంధమూ లేదని ప్రకటించారు. కాని పంతు తీర్మానానికి తమ వ్యతిరేకతను తెలియ చేయాలను కున్నారు. ఈవ్యతిరేకత వేరు వేరు రీతుల తెలియ జేయబడింది. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ప్రతినిధులు ప్రదర్శనాన్ని ఖండిస్తూ, పంతు తీర్మానాన్ని వ్యతిరేకిస్తూ మాట్లాడారు. కాని పంతు తీర్మానానికి సవరణ ఉపపాదించలేదు. తీర్మానము ఓటుకు వచ్చినపుడు తటస్థంగా ఉండినారు. కమ్యూనిస్టులు, సోషలిస్టులకు వలెనే ప్రదర్శనాన్ని ఖండించారు, కాని సవరణ ఉపపాదించి తీర్మానానికి వ్యతిరేకంగా ఓటుచేశారు. కమ్యూనిస్టు లవలంబించిన పద్ధతి సోషలిస్టు లవలంబించిన పద్ధతికన్న సరియైనది. శిక్షకు కట్టుపడని అతివాదులతో తమకెట్టి సంబంధము లేదని ప్రకటించాలసిన అవసరముంది. కాని తటస్థత వహించుటవలన సోషలిస్టులుకాని అతివాదుల నుండి దూరముగ పోవుటయే సంభవిస్తుంది. అందుచే తటస్థంగా ఉండుట అసంభవము. నిజానికి, కమ్యూనిస్టులు క్రమంగా ఈనిర్ణయానికి వచ్చియుండి, కాంగ్రెసు సోషలిస్టులను కూడ తమ దృక్పధము నవలంబించునట్లచేసి యుండినచో అతివాదుల నందర్నీ కూడగట్టుకొని రాగలిగి ఉండేది. సోషలిస్టులు, కమ్యూనిస్టుల అవలంబించిన ఈవివిధ పద్ధతుల పిదప బయలుదేరిన విచ్ఛేద నాశక్తులకు తావులేకుండా జేసేవారు.)

బహిరంగ సమావేశములో పంతు తీర్మానముపైన దత్తమజుందారు మరియొక ఉపన్యాసమిచ్చాడు. మొదటి ఉపన్యాసము లాంటిదే ఇది కూడ, కాని దానికన్న కొంచెము మెరుగు.

బంకిం ముఖర్జీ అతివాద ముఠాకుచెందిన ఒక వ్యక్తిలాగ మాట్లాడాడు కాని ఐక్యతను కాపాడవలసిన తీవ్రవాజకీయ వేత్తయగు బోల్షివిక్కువలె మాట్లాడ లేదు:— గతరెండు సంవత్సరాలుగా, ప్రతి ప్రధాన కాంగ్రెసు మీటింగు జరుగబోవు నపుడు, మితవాదులు ఏదోయొక ఉపద్రవము తెచ్చిక్లిష్ట పరిస్థితులు కలుగజేస్తూనే ఉన్నారు. ఈవిధంగా చేయడములో వారిఉద్దేశము కాంగ్రెసు ఎదుర్కొవలసిన ప్రధాన సమస్యలను చర్చించకుండా వెనక్కి నెట్టివేయించడమే.

తిరిగి అతివాద జాతీయ నాయకులు తమ సంగీతాన్ని తిరిగి ఆలాపించి వినిపించారు. ఆ అసందర్భ భాషణ లన్నిటిని వింటూ కూర్చున్నపుడు తలనొప్పి వచ్చేది.హృదయము నిరాశాపూరిత మయ్యేది. అతివాదుల అపజయానికి కారణము కొంతమంది అతివాదులే.

స్వదేశ సంస్థానాలపై తీర్మానము

గత సంవత్సరము నందలి అతి ప్రాముఖ్యమైన విషయము స్వదేశ సంస్థాన ప్రజల ఉద్యమము. ఇది ఫెడరేషనుకు వ్యతిరేకముగా దేశవ్యాపక పోరాటాన్ని సాగించడానికి అత్యంత ప్రధానమైనది.

(నెహ్రూ యొక్క చిత్తు తీర్మానములో స్వదేశ సంస్థాన విషయాలలో జోక్యము కలుగజేసుకొనుటకు కాంగ్రెసుకు హక్కుగలదు అని తెలియజేయబడింది. ఆచరణలో కాంగ్రెసు జోక్యము ఇదివరకే కలుగజేసుకొనినది) అంటే నెహ్రూ తీర్మానము ప్రస్తుతము కాంగ్రెసు ఎంతవరకు ముందుకు వెళ్ళిందో దానినే ప్రతిబింబిస్తూ ఉంది. దానినిదాటి, ఈ వివిధ స్థానిక స్వదేశ సంస్థాన పోరాటాలను కలిపి ఒకే కేంద్రమునుండి కాంగ్రెసే నడుపాలసిన అవశ్యకతను అది గుర్తించలేదు. సోషలిస్టులు కమ్యూనిస్టులు కలిసి, అట్టి సవరణను ఉపపాదించారు. తీర్మానము హరిపురా తీర్మానాన్ని సమర్థించినది. అక్లాజును తీసివేయవలసినదిగా కూడ సవరణలో సూచించబడింది. కమలాదేవి సవరణను ప్రతిపాదించింది. కాని అప్పటికే కాంగ్రెసు సమావేశము పేరుకుమాత్రము సమావేశముగ తయారయింది. కమలాదేవికూడ ఈ విషయానికి జీవకళను కలిగించి, సమావేశమును పునర్జీవింప జేయజాలకపోయింది.

మిగిలిన తీర్మానాలు ఉపపాదించబడ్డాయి, ఏకగ్రీవముగా అంగీకరించబడ్డాయి.

త్రిపురి సమావేశ ఫలితాలు.

త్రిపురికి అతివాదులు సంతోషములో, ఆశతో వెళ్లారు భగ్నహృదయాలతో, నిరాశతో తిరిగి వచ్చారు. దీనికి కారణమేమిటి?

సమావేశాన్నంతా, ఆకర్షించిన సమస్య "ఐక్యత". కాంగ్రెసు ఐక్యతను కాపాడడానికి అతివాదులు పనిచేసినంతవరకు ఈ ఐక్యతను ఆధారము చేసుకొని ముందుకు సాగడానికి కార్యక్రమము సూచించినంతవరకు, కాంగ్రెసు వాదులందరియొక్క సానుభూతిని సహాయమును (సహకారమును) పొందగలిగారు. ఉదాహరణ: పూర్వపు వర్కింగు కమిటీ సభ్యులను వేదికపైకివచ్చి తమ స్థానాలను మునుపటిలాగనే అలంకరించమని సుభాసు బోసు కోరినపుడు, అన్నివైపులనుండీ హర్షధ్వనులు చెలరేగాయి.

త్రిపురీ సమావేశము, అతివాదులలో రాజకీయ ఐక్యతలేదని తెలియజేసింది. విభేదాలతో ఉండిన, అతివాదులు కాంగ్రెసును ఐక్యతా మార్గాన నడుపలేరు. పోరాటాన్ని మరచి కేవలము ఐక్యతా సమస్య కొందరు ముందుకు తెచ్చారు. దీనిఫలితము, ఐక్యతను వ్యతిరేకించు కొంతమంది మితవాదులకు లొంగిపోవడమే అయింది. మరికొందరు, ఐక్యతను మరచి, పోరాటాన్ని గూర్చి చర్చించారు. దీని ఫలితము పరిస్థితుల నర్థముచేసుకొనక, కండ్లు మూసుకొని ముందుకు దుమికి అవకతవకలు చేయడమే (అడ్వెన్చరిస్టులు గావడమే). చాలకొద్దిమంది మాత్రమే, పోరాటము, ఐక్యత రెండూ ఒకదానిపై నొకటి ఆధారపడి ఉందని గ్రహించారు.

త్రిపురిలో ప్రధానమైనపని ముందుకు మరియొక అడుగు వేయడానికి సంయుక్త నాయకత్వమును నెలకొల్పటయే. కాని కొంతమంది జాతీయ అతివాద నాయకులు దీనిని గుర్తించక కేవలము పాక్షిక దృక్పధాన్ని అవలంభించారు. సుభాసుబాబు విజయము మితవాదులపై అతివాదుల విజయముగా వారు పరిగణించారు. త్రిపురీలోని ఈ ప్రధాన పనిని గుర్తించకపోవడమువలన మితవాదులు అతివాదులకన్న చక్కని ఎత్తులు వేసి ఓడించగలిగారు. అతివాదులకు నిర్మాణరీత్యా దెబ్బతగిలింది.

అయితే త్రిపురి ఘటనలు, మితవాద నాయకత్వము స్థానాన కేవలము అతివాద నాయకత్వము కావాలనే సిద్ధాంతాన్ని నాశనము గావించాయి. వారు తమ సిద్ధాంతాన్ని కొనసాగించడానికి పూనుకొనినపుడెల్లా వారు ఐక్యతకు అడ్డంకిగానైనా తయారయ్యేవారు. లేదా అడ్వెన్చరిస్టులుగానైనా తయారయ్యేవారు.

అయినా, అతివాదులమధ్య ఐక్యతలేనట్లు కన్పడినా, నిజంగా లేకపోయినా, అతివాదుల ఒత్తిడి త్రిపురి నిర్ణయాలను ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని కొంతవరకు మార్పు చేయగలిగింది.

ఉదాహరణ నేషనలు డిమాండు తీర్మానము:—త్రిపురీ సమావేశము జరుగబోవుటకు ముందు మన నినాదాలు రెండు. (1) ఫెడరేషనును మనపైరుద్దువరకు మనము వేచియుండజాలము. సామ్రాజ్యవాదము అంతర్జాతీయ చిక్కులలో చిక్కుకొని ఉన్నప్పుడు, ప్రజా పోరాటము రోజు రోజుకూ బలిష్టమగుతున్న యీ సమయమందే మనము దాడి నారంభించాలి. (2) మనలను పోరాటంలో నడపడానికి సంయుక్త కాంగ్రెసును సంయుక్త నాయకత్వమును కోరితిమి. నేషనలు డిమాండు తీర్మానములో లోపములున్నా, అది మొదటిసారి "దేశ వ్యాపక పోరాటాన్ని" గూర్చి తెలియచేస్తూ ఉంది. ఆ పోరాటముకూడ ఒక్క ఫెడరేషను ఉద్దేశించికాదు. "జాతీయోద్యమంయొక్క

(మిగతా 22 వ పేజీలో)



## కధ

(6 వ పేజీ తరువాయి)

రాకాసులు చెలరేగినట్లు గోల చేస్తున్నాయి. ప్రవక్తలు చెప్పేటట్లు పంచభూతాలు తిరుగుబాటు చేసినట్లుగా వుంది. అయినా ఆ ప్రళయ చిహ్నాలమధ్య ఆమె భూమిమీదనే నిలబడివుంది. భూమి ఏమీ తిరుగుబాటు చేసినట్లు లేదు.

రాళ్ళు, రప్పలు; పొదలు, పుట్టలు అన్నీదాటి గ్రామంలోకి పరుగుతీసింది. భయంచేత అవయవాలు బిగుసుకుపోతున్నాయి. అడుగులు పడటంలేదు. తనకి గ్రామానికి ఇంకా వందగజాలదూరంవుందన్న స్పృహ ఆమెకులేదు. తన శరీరం తునియలైనా సరె. ఎముకలు ముక్కలైనా సరే ఒక్కగంతులో వెళ్ళి గ్రామములో పడాలనే ఆమె కోరిక.

తడబడుతూన్న కాళ్ళల్లో ధైర్యం నెలకొల్పడానికి ప్రయత్నించింది. ఇంతలో మరియొక పెద్దబాంబు. ఆ ధ్వనికి ఆమె అకస్మాత్తుగా నిలబడిపోయింది. ఆమె ముందు భూమిపెద్దబీటుతీసింది. అది తప్పించుకొని రోదనచేస్తూ "నాబిడ్డడు, నా బిడ్డడు" అంటూ పరుగెత్తింది. పరుగెత్తుతున్నకొద్దీ ఆమెలోని ఆశ అడుగంటుతూ వచ్చింది. ఆకాశంలో విలయవిహారం చేస్తూన్న విమానాలకేసి తలఎత్తి చూసింది. భయభ్రాంతులైన ఆమెనేత్రాలు విమానాలను దీనంగా ప్రార్థించాయి, తన ముద్దులపట్టినిమాత్రం తప్పించమన్నట్లుగా.

ఆమె ముందు, గుడిసెలన్నీ తగులబడిపోతున్నాయి. కొన్ని ఇదివరకేతగులబడి బుగ్గైయిపోయాయి. హడలిపోయిన జీవరాసులన్నీ ప్రాణాలు రక్షించుకోడానికి పారిపోతున్నాయి. ఎవరిమట్టుకువారు పెద్దపెద్ద రాళ్ళక్రింద తలదాచుకుంటున్నారు. పిల్లలతల్లులు, పడుతోలేస్తో తమతమ పిల్లల్ని ఈడ్చుకుంటూ పరుగెత్తుతున్నారు. తన రహమత్ ఏమయాదో?......

ఆకాశంలోకి లేచిపోతూన్న పొగనంతనీ కొట్టుకుపోతూ, విమానాలు అటూ ఇటూ తిరుగుతున్నాయి, బాంబులను పడవేస్తూనే వున్నాయి. విమానాలమీద కరీమాకు ఎక్కడలేని కోపంవచ్చింది. పైన పైతిరుగుతూన్న విమానాలకేసి పగతీర్చుకుంటానన్నట్లుగా పిడికిళ్ళు చూపెట్టింది. తన క్రోధానలం విమానాలను భస్మీపటలం చేస్తూంటే చూడడానికా అన్నట్లు వాటికేసి అల్లేచూసింది. కాని విమానాలు బాంబులు పడవేస్తూనే వున్నాయి.

ఒక పెద్ద మూలుగు. నిరాశాపూరితమైన ఆక్రందన ధ్వని. 'నా బిడ్డ! నా బిడ్డను రక్షించండి!' అంటూ ఏడుస్తూ పిచ్చిదానిలా పరుగెట్టింది.

"కరీమా! ఎక్కడికి పరుగెడుతున్నావు? ఆగు." అని కేక వేశాడు, ఒక కుమ్మరిసారె వెనకాల దాక్కుని విమానాలమీదికి తుపాకి పేల్చుతున్న అబ్దుల్ మజీద్.

కరీమా వినిపించుకోలేదు. పరుగెత్తుతూనే ఉంది.

"పిచ్చిపిల్లా! ఎక్కడికి పోతావు?" అని మజీద్ తన చేయి అడ్డంగా చాచాడు.

ఆమె పెనగులాడింది. కుమిలిపోతూన్న హృదయముతో "నన్ను పోనీ! నా బిడ్డని రక్షించుకోనీ!" అని ఏడ్చింది.

"వెర్రిపిల్లా! గ్రామమంతా తగులబడిపోతూంటే ఎట్లా పోదామనుకుంటున్నావు? అల్లా తెల్లతెప్పిశాచాలు అంతా ధ్వంసం చేస్తున్నారు" అన్నాడు మజీద్.

ఆమెకది ఏమీ తలకెక్కలేదు. "నన్ను వెళ్ళనీ, వెళ్ళనివ్వవూ?" అంటూ అతనిచేతిని గట్టిగా కరిచింది. బాధ పడలేక మజీద్ తన చేతిని తీసివేసాడు.

"అల్లా! అల్లా!! స్వతంత్రులైన నీ సంతతి నంతనీ నాశనం చేసి వేస్తున్నారు" అని గొణుగు కున్నాడు.

కరీమా, అబ్దుల్ మజీద్‌ను తప్పించుకుని తగులబడిపోతున్న గుడిసెల మధ్యకు చొరబడింది. మొదట మంటలమీదనుంచి దాటివెళ్ళడానికి భయపడి నిలబడిపోయింది. కోపముతో పళ్లు కొరికింది. మళ్ళీ ధైర్యం చేసి, కళ్లు మూసుకుని 'బిస్మిల్లా' అని దూకింది. కొంచమైతే అవతల ఒక మట్టిదిబ్బమీద పడేదే. కాని ఆపుకోగలిగింది. తన బట్టలు తగులబడకుండా పట్టుకుని రోచుకుంటూ పరుగెట్టింది.

ఆమె గుడిసెకు అనతిదూరములోవున్న మసీదు ఆవరణలో ఒక బాంబు పడింది. ఆమె ప్రాణాలు ఎగిరిపోయినట్లయింది. తగులబడిపోతూన్న కొంపలనుండి మంటలు వేయి నాల్కలతో అన్ని వైపులకూ వ్యాపించి ఆమె మార్గాన్ని నిరోధిస్తున్నాయి. రక్త మాంసాలు ఉడికిపోతూన్న ఆ వేడిలో ఒక గోడ పట్టుకుని ఇంకొక గోడకు, ఇల్లా ప్రాకిపోతూంది. కాలి, కాలి కూలిపోతూన్న ఆ కొంపల మధ్య తన కుమారుడేవిధముగా వున్నాడో చూడాలనే ఆమె కోరిక. మసీదు గోపురము మాత్రం పడిపోలేదు. తన గుడిసెకూడా కాలకుండా వుండకూడదూ? తన కొడుకు ఇంకా బ్రతికి వుండకూడదూ? అని ఆశించి, అంత దుఃఖంలోను, తన రహమత్ బ్రతికివుంటే పీర్లపండగకు దైవపీఠంమీద ఏదో సమర్పిస్తానని మ్రొక్కుకుంది.

చివరకి తన గుడిసెకూడా తగులబడుతూండడం చూసింది. ఒక గోడ సగం కూలిపోయిందికూడాను. వెదుళ్ళు టప్‌టప్‌మని శబ్దం చేస్తూ కాలుతున్నాయి.

నలుదిశలు పరికించడానికికూడ ఆమెకు వ్యవధిలేదు, గుడిసెలో చొరబడింది. పొగ వూపిరాడనివ్వక ఉక్కిరిబిక్కిరి చేస్తోంది, కళ్ళు కనబడటంలేదు. మంటలు వెనుకకు తరిమివేస్తున్నాయి. అయినా ఆమె లోపలికి దూరింది.

పిల్లవాడు పడుకున్న మంచం కూడా కాలుతోంది. వాడు కక్కటిల్లి ఏడుస్తున్నాడు. ఒళ్లంతా ఎర్రగా కందిపోయింది. తుదిప్రయత్నంలో ఏది దొరికినా పట్టుకుందామన్నట్లు చేతులు పైకిచాచి మరీ ఏడుస్తున్నాడు.

'కొడుకా! కొడుకా!' అని కౌగలించుకుంది. ఎత్తుకుని హృదయానికి హత్తుకుంది. ఇక వాడ్ని బైటకు జేర వెయ్యాలి.

ఇంటికప్పు కూలి గుమ్మానికి అడ్డంగా పడింది. బైటికి పోవడానికి మార్గం కనబడ లేదు. ఆమెకొక ఉపాయంతోచింది. ఇంటిలోవున్న మంచినీటికూజా నుకూలిన కప్పుమీదికి విసరింది. కాని పాపం! అది సరిగా దానిమీద పడలేదు. కొంచెం ప్రక్కగా పడింది. కొద్ది మేర నిప్పుసుమాత్రమే ఆర్పగలిగింది. నీళ్ళన్నీ వృధాగా కారిపోయాయి.

ఆమెకేమీ తోచలేదు. కూలిపోయినగోడలో సందునుంచి చిన్నమార్గం మాత్రం వుంది. అందులోనుంచి దూరి బైటపడాలి. ఏడుస్తూన్న కొడుకును రొమ్ముకు అద్ది పట్టుకుంది. "ఏడవకు నాయనా! ఏడవకు" అని సంబోధించి చెప్పింది. వాడిమీద ఏమీ పడకుండా గుడ్డతో కప్పింది. ముందుకు చొరబడింది. కాని ఆ తొందరలో ఒక నిప్పుకణం మీద కాలువేసింది. కాలు చుర్రుమంది. తూలిపోయింది. ఎల్లాగో ఆపుకుని బైటపడింది.

కొడుకును రక్షించుకున్నానుకదా! అనే వెర్రి సంతోషంతో వాడ్ని ఇంకోసారి రొమ్ముకు అద్దుకుంది. వాడిలోను, తనలోను ధైర్యం కొచ్చుకోడానికా అన్నట్లుగా వాడికేసి చూసి కాంతిలేని చిరునవ్వునవ్వింది.

చొక్కాకు నిప్పు అంటుకున్న సంగతి అంతవరకు ఆమె చూచుకోనేలేదు వెంటనే చొక్కానుఅంతవరకు చింపివేసింది. కుర్రవాడ్ని బుజంమీద వేసుకుని ఆసందువెంబడి పరుగుపెట్టింది.

వెనుకకు తిరిగి మసీదుకేసి చూసింది. మసీదులో తలదాచుకోవచ్చునేమో అనుకుంది. కాని మసీదుకూడా కూలిపోయింది. ఆమెకేమీ తోచలేదు. "మజీద్! మజీద్! నాబిడ్డను రక్షించవూ?" అని కేకలు వేసింది. ఆ రణ గొణ ధ్వనిలో ఆమె దీనాలాపాలు ఎవరికి వినబడతాయి! మజీద్‌కు ఏమీ వినబడలేదు. మంటలలో మాడిపోతూన్న ప్రజల హాహాకారాలు తప్పితే ఆమెకేమీ సమాధానం రాలేదు.

తాను వచ్చిన తోవనే పోదామనుకుంది. తాను ఇందాక దాటిన మంటలు ఈపాటికి ఆరిపోతాయి. ఒక్కదూలం మాత్రము కాలుతూ వుంటుంది. సులభముగా దాటిపోవచ్చునన్నుకుంది. రహమత్‌ను గట్టిగా అదిమిపట్టుకు బయలుదేరింది. దానికి పది గజాల దూరంలో వుండగా దభాలున ఒక ఇంటికప్పు కూలి దారికడ్డంగా పడింది. ఆమెకున్న ఒక్క మార్గంకూడ నిరోధింపబడింది. మంటలు ఆకాశాన్నంటుతున్నాయి. మంటల వేడిమికి ఆమె ఒడలు ఉడికిపోతోంది. నిస్పృహతో తల బాదుకుంది. "ఓ! అల్లా!! ఎక్కడున్నావు ప్రభూ! నన్ను రక్షించవూ? ఓ! షామూస్, షామూస్" అని ఆక్రందించింది. ఎక్కడి షామూస్! ఎక్కడి అల్లా!

చేతులలోని కొడుకుకేసి చూసుకుంది. వాడికి స్పృహ తప్పిపోతోంది. ఇంక నిలబడలేక పోయింది. నిరాశాజనితమైన సాహసముతో ఆ మంటల కడ్డముపడింది. కాని, పాపం! తగులబడుతూన్న గడ్డి కప్పులో కూరుకుపోయింది.......రహమత్ లేత బుగ్గలు తన బుగ్గలకు అద్దుకుంది......."రహమత్!......ర-హ-మ-త్......!"

కార్మిక సమస్యలు

# తిరుపూరు సమ్మె పరిష్కారము

తిరుపూరు కోయంబత్తూరు జిల్లాలో టెక్స్టయిల్ పరిశ్రమ కేంద్రము. ఇక్కడ మూడు మిల్లులు సుమారు 5 వేలమంది పనివారలతో పని చేయుచున్నవి. వాటిలో ధనలక్ష్మి, రామలింగచూడాంబిక మిల్లులలో జనవరి 2 వ తేదిన 147 మంది పనివారలను చాలా సర్వీసు కలవారిని ఆర్థికక్షోభ అను మిషతో పనినుండి తొలగించిరి. ఈరెండు మిల్లులలోను సుమారు 3 వేల మంది పనిచేయుచున్నారు. ఈ 147 మంది కార్మికులను పనిలో పెట్టుకొనాలని అనేకరీతుల ప్రయత్నించిరి. కాని లాభము లేకపోయినది. చివరకు ఫిబ్రవరి 2 వ తేదిన టి. వి. రామస్వామి (జిల్లా కాంగ్రెస్ కమిటి సభ్యుడు)గారు కార్మికులకు జరుగుచున్న అన్యాయమును సహించలేక, నిరసన దీక్ష ప్రారంభించిరి. ఫిబ్రవరి 5 వ తేదిన కోయంబత్తూరు జిల్లా టెక్స్టయిలు లేబరు యూనియన్ కార్యదర్శి ఆర్. రాముగారు కూడ నిరసన దీక్ష ప్రారంభించిరి.

ఫిబ్రవరి 7 వ తేది నుంచి పనివారందరిని పనిలో ప్రవేశపెట్టుకొనాలని యీరెండు మిల్లులలోని వారందరు సమ్మెచేసిరి. పట్టణ తాలూకా జిల్లా కాంగ్రెస్ కమిటీలు కార్మికులకు సానుభూతి చూపటమేగాక, ప్రత్యక్షముగా సహాయముచేసిరి. తిరుపూరు మున్సిపల్ ఛేర్మన్ స్వయముగా కార్మికులకు ధనము పోగుచేసి యిచ్చెను. అంతేగాక చాలామంది స్త్రీలుకూడ, చందాలు వసూలుచేయుట యందు పాల్గొనిరి. స్థానిక కాంగ్రెస్ నాయకుల ఒత్తిడివల్ల 10 వ తేది, రామస్వామి రాముగార్లు యిద్దరునూ, నిరసన దీక్షను ఆపివేశిరి. 10 తేదీనే ఆమిల్లుల యజమానులు లాకౌటుచేసిరి.

సమ్మె కమిటీతరఫున సహాయ సంఘాన్ని యేర్పాటుచేసిరి. ఇక్కడ 500 మంది సంసారాలకు టిక్కెట్లు 1200 మందికి భోజన వసతులు యేర్పరిచిరి. తిరుపూరులోను, చుట్టు ప్రక్కలవున్న రైసు ఫ్యాక్టరీషావుకార్లుకూడ కార్మికులకు బియ్యము, ధనము సహాయము చేసిరి.

కాంగ్రెస్ యం. యల్. ఏ జిల్లా కాంగ్రెస్ కమిటి కార్యదర్శి, లేబరు యూనియన్ కార్యదర్శి, ఇతర కార్మిక నాయకులు, చుట్టుపట్ల పల్లెలలో సమ్మెను గూర్చి తెలియ చేయుచూ, సభలు జరిపిరి. కార్మికులు యితర ప్రజాసామాన్యముయొక్క సానుభూతి సంపాదించుకొనగల్గిరి.

ఈసమ్మె నాయకులు రాజీకై ఆతుర పడుచున్ననూ, మిల్లు యజమానులు చాలా పట్టుదలబూని, కార్మికులను తిండికి అల్లాడించి లొంగదీయవలెనని పట్టుపట్టిరి. మార్చి 13 వ తేదీన లేబరు కమిషనరు, అతని కార్యదర్శికూడ రాజీ ప్రయత్నములు జరిపిననూ, లాభము లేకపోయినది. గిరిగారు స్వయముగా యజమానుల ప్రతినిధులతో జరిపిన సంప్రదింపులుకూడ విఫలమయినవి. ఇంతకూ, కార్మికులు కోరినది, పని చేయుగంటలు తగ్గించి అయిననూ యీ 147 మందిని తిరిగి పనిలో ప్రవేశపెట్టుకొనవలెనని. కాని యజమానులు యీ కోర్కెను మన్నింపరైరి. కార్మికుల కోర్కె స్వల్పమైననూ ప్రజానీకమంతయు కార్మికులకు అన్నివిధాల తోడ్పడి కార్మికులు తిండిలేక ఓడిపోతారను సంశయము లేకుండా చేసింది. యజమానుల పెంకితనమును అనేకబహిరంగసభలలో నిరసించబడినది. కాని కార్మికనాయకులు గిరిగారు, యిది కార్మికులకు, యజమానులమధ్య తగవుకాదని, కేవలము తాత్కాలికముగా గల్గిన అభిప్రాయభేదమేననియు, పనివారలు శక్తిమీర పనిచేసినయెడల కొన్ని సౌకర్యములు కలుగుట కవకాశమున్నదని తాను యెవరిది తప్పుయా, యని విచారించుటలేదని, తెలియచేశాడు. కార్మికుల కోర్కె స్వల్పమైననూ, యీ వివాదములో చాలా ముఖ్యసిద్ధాంతము యిమిడిఉన్నది. ఆర్థిక క్షోభమిషతో పనివారిని యజమానులు పనినుండి తొలగించు చుంటే పనివారలు చేయు ప్రతిఘటనలు వివాదాగ్రస్తవిషయము కాదన్నట్లుపల్కుటశోచనీయం.

సమ్మె ప్రారంభించిన 45 రోజులకు, కార్మికులకు ప్రజానీకము బలమును గ్రహించుటవలననూ, కాంగ్రెసు మంత్రివర్గము పరిష్కారకమిటీ వేస్తామని ఒత్తిడి చేయుటవలననూ యజమానులు రాజీ పడిరి.

సమ్మెకు పూర్వము, వారమునకు రాత్రి 59 గంటల పగలు 59 గంటలు పనిచేశారు. కార్మిక సంఘమువారు వారమునకు 55 గంటలకు తగ్గించుటకు అంగీకరించుచూ, యీ 147 మందిని పనిలో ప్రవేశపెట్టుకొనవలెనని కోరిరి. వంతులు యేర్పాటు చేయుటకు వీలుకొరకు వారమునకు 38½ గం॥ పనిచేయుటకు యజమానులు అంగీకరించిరి. వారము రోజులలో పనివారందరు పనిలో ప్రవేశించుటకు అవకాశమిచ్చిరి. కాని, కార్మికుల జీతాలు కూడా చాలా తగ్గును. దామాషానుబట్టి చూచిననూ, యిన్ని గంటలు పని తగ్గించి, కార్మికుల జీతములు తగ్గించ నవసరంలేదు. లాకౌటుచేసిన రోజులకు జీతముల విషయమే తలపెట్టలేదు. క్రొత్తగా మరియొక మిల్లు యేర్పడినది. నిజానికి, యీ ఆర్థిక క్షోభవల్ల యీ పరిశ్రమకు నష్టము కలుగదు.

# డిబ్రూగర్ కార్మికులపై లాఠీచార్జి

తీవ్రమైన లాఠీచార్జి 100మంది గాయపడిరి 30 మంది అపాయస్థితిలో నున్నారు.

డిబ్రూగర్‌లో రైల్వే కంట్రాక్టరువద్ద పని చేయు కార్మికులు కొంతమందిని పనిలోనుండి తగ్గించుటవలన సమ్మె చేసిరి. స్టీమరులో ఎగుమతి దిగుమతులవద్దకూడ పికెటింగు చేసిరి. రైలు పెట్టెలనుకూడ ఆపుచేయుటకు స్త్రీలు పట్టాలమీద అడ్డంగా శాంతియుతముగా పండుకొనిరి. సమ్మెదారులకు స్థానిక కాంగ్రెసు కమిటీ పూర్తిగ సహకారము చేయుచున్నది. తోటలలో పనిచేయు కార్మికులుకూడ సమ్మె చేసిరి.

కార్మికుల ప్రతిఘటనా శక్తిని అణచివేయుటకు పోలీసు అధికారులు జోక్యము కలుగజేసుకొని శాంతముగానున్న కార్మికులపై లాఠీచార్జి చేసిరి. 30 మంది అపాయస్థితిలో నున్నారు. పోలీసు అధికారుల చర్యను ఖండించుచూ, కార్మికులకు సానుభూతి తెలియచేయుచూ బహిరంగ సభ జరిగినది. స్థానిక కాంగ్రెసు అధ్యక్షులు గోస్వామి 14 గురు సభ్యులు స్టీమరు రైల్వే కంపెనీలకు వ్యతిరేకముగా ప్రచారము చేయుచున్నారని అరెస్టు చేయబడిరి. 30 వ తేదీని కేసు విచారణ చేయబడును.

సమ్మె చేసి కొన్ని హక్కులను పొందగల్గిరి. అప్పటినుంచి యజమానుల సంఘములో పని చేయు కార్మికులను శిక్షించుటకు పూనుకొనిరి. పూర్వము సమ్మె సందర్భమున నవంబరు 13వ తేదిన జారీ చేయబడిన 144 సెక్షను జనవరి 12 వరకు అమలులోనున్నది. యజమానుల దాడిని యెదుర్కొనుటకు కార్మికులు డిశంబరు 15 వ తేదీన "స్ట్రేయిన్‌స్ట్రయికు" చేసిరి. ప్రెసు యూనియన్ పనులకు కార్మికులను శిక్షించినట్లు యజమానుల రికార్డునందే కలదు.

డిప్యూటీ సూపరింటెండెంటు పూరేగింపులు జరుపుకొనుటకు ముందే లైసెన్సు పొందాలని వుత్తరువు జారీచేశాడు. ఈ ఆర్డరు నెలరోజుల వరకు అమలు నందుండును.

కార్మికమంత్రి గిరిగారు యూనియన్ కార్యదర్శితో సంప్రదించిరి. యజమానులు జిల్లా కలెక్టరుకు 9 షరతులను తెలియచేసిరి, వాటిలో సమ్మె లాకౌట్లుకు సంబంధించినది తప్ప మిగిలినవన్నీ యూనియన్ కార్యదర్శి అంగీకరించినట్లు తెలియుచున్నది. కాని యజమానులు సమ్మె-లాకౌటును గూర్చిన దానిమీద ప్రతిష్టంభన కల్గించింది ప్రభుత్వము విచారణ కోర్టును నియమించెదరని తెలియుచున్నది.

## మధుర

మిల్లు కార్మికుల సమ్మె. 1500 మంది సమ్మె చేయుచున్నారు.

మధుర మీనాక్షి మిల్లు కార్మికులు పూర్వం

## మద్రాసు

పబ్లిషింగ్ హౌసు సమ్మె.

ఇది మద్రాసు ప్రింటింగు ప్రెస్‌లలో పెద్ద ప్రెస్‌లలో ఒకటి. ఫిబ్రవరి 23 వ తేదీ యజమానులు ఒక మిషిన్‌మన్‌ను పనినుండి తొలగించారు. వెంటనే కార్మికులందరు స్ట్రెయిన్ సమ్మె చేశారు. లేబరు కమిషనరు విచారణచేసి యీ మిషన్ కార్మికుని, తక్కిన పనివారందరిని పనిలో ప్రవేశపెట్టుకోవలెనని తెలియచేశాడు. ప్రెస్ యజమానులంతా సమావేశమై యీ కార్మికుడు అవిధేయతతో ప్రవర్తించాడని, పని అంతా పోవుటవల్ల పనివారందరిని పెట్టుకోజాలరని, తెలియచేశారు. 11-3-39 తేదీన మద్రాస్ ప్రెస్ లేబరు యూనియన్ కార్యదర్శి ఏ. యస్. కె. అయ్యంగారు యజమానులతో పనివారందరిని పెట్టుకొన వలసినదిగా కోరాడు కాని కార్మికులు పికెటింగు ప్రారంభించిరి. కొంతమంది కార్మికులు అరెస్టు చేయబడిరి. 18-3-39 ఒక కారులో పనివారిని యెక్కించుకొని పోవుచుండగా ముగ్గురు పనివారలు కారుకు అడ్డముగా పడుకొనవలసివచ్చినది. కారు 'అప్పమాడు' అనే కార్మికునిమీదగా పోయినది. మరమరణావస్థయందున్నట్లు తెలియుచున్నది. ఈ ముగ్గురి కార్మికులను అరెస్టుచేసి, 6 నెలలు కఠినశిక్ష 1 నెల విడిశైదు. రెండు సెక్షనుల క్రింద శిక్షించిరి.

తరువాత గిరిగారు యజమానులతో చర్చించి పనివారందరిని పనిలో ప్రవేశపెట్టుకొమ్మని చెప్పిరి. తగాదా పరిష్కారమయినదని కూడ ప్రభుత్వము ప్రకటించినది. కాని యజమానులు కార్మిక మంత్రి గిరిగారి తీర్పునుకూడ ధిక్కరించి తాము ప్రెస్ తాత్కాలికముగా మూసివేయుచున్నామని ప్రకటించిరి.

అరెస్టుచేసి శిక్షింపబడిన కార్మికులను ప్రభుత్వము వెంటనే విడుదల చెయ్యాలి. యజమానులు గిరిగారి తీర్పును అమలు నందుంచుటకుల ఒత్తిడి చేయాలి.

## తెనాలి

లక్ష్మీ ప్రెస్ సమ్మె.

షుమారు 15 రోజులనుంచి సాగుచున్నది. అక్కడ ఎవ్వరును పనిచేయుట లేదు. విజయనగరం, బెజవాడ పట్టణాలలో ప్రెస్‌వర్కర్సు సానుభూతి సభలు జరిపిరి. గుంటూరులో సుమారు రు. 8 వరకు విరాళములు పోగయినవి. బెజవాడలోకూడ విరాళములు పోగుచేయుచున్నారు. ఇతర పట్టణాలనుంచి పనివారు తెనాలికి పోకుండా స్థానిక సంఘములు తీవ్రముగా కృషిచెయ్యాలి. అంతేగాక, స్థానికసంఘములు విరాళములు వసూలుచేసి తెనాలి ప్రెస్‌వర్కర్సు యూనియన్ కార్యదర్శికి పంపాలి. గుంటూరులో యిప్పటివరకును స్థానిక సంఘములేదు. వెంటనే సంఘము స్థాపించుటకు పోషలిస్టులు పూనుకోవాలి.

గవర్నమెంటు సూచనపై మేజస్ట్రేటు పనివారల వద్దనుంచి, యజమానుల వద్దనుంచి స్టేటుమెంట్లు తీసికొన్నారు.



# కాకినాడ ఉప్పు కూలీల సమ్మె

## నలుబది రోజులనుండి సమ్మె సాగుతూవుంది

కామ్రేడ్ కొరపాటి పట్టాభిరామయ్య

కాకినాడ ఓరియంటల్ సాల్టుకంపెనీవారి కొఠారులలో షుమారు 250 మంది కార్మికులు పనిచేస్తున్నారు. వారు షుమారు 12 మైళ్ళ దూరమునున్న తమ గ్రామాలనుంచి, తెల్లవారు ఝామునలేచి కాళ్ళీడ్చుకుంటా వచ్చి పనిచేస్తారు. రోజుకు 10 గంటలకు తక్కువ కానిపని. ఆమండే యెండల్లో వీపు మాడ్చుకుంటూ, కాళ్ళు కాల్చుకుంటూ పనిచేయాలి. పనిచేసేటప్పుడు భూమిలోనుంచి వచ్చే వేడికి, కళ్ళన్ని పాడయి పోతాయి. ఇప్పటికీ కార్మికుల కళ్ళు చాలవరకూ పాడయి పోయాయి. కళ్ళు పాడుచేసుకుని, వేడికి బాధపడుతూ, ఆరోగ్యం చెడగొట్టుకుని పనిచేస్తే యిచ్చేది. 0-4-6 పూర్వం యింతకన్న హెచ్చుకూలి ఉండేది. మధ్యనున్న ఉద్యోగస్తులు తమ ఉద్యోగాల నిలకడ కోసం పై ఉదోగస్తుల ప్రాపకంకోసం. కూలీల కూలిని 0-4-6 కు తగ్గించేశారు. ఇంతేగాకుండా అకొఠారు సూపర్ వైజరు కూలీలను తిట్టేతిట్లు చెప్పడానికి వీలులేదు.

కూటికి చాలని డబ్బులతో బాధలుపడలేక ఎన్నోసార్లు కూలీలు అధికారుల్ని కూలీ హెచ్చించమని అడిగారు. ధనికవాదపు ఉయ్యాలలోనూగే అధికారులకీ ప్రార్థనలు వినిపించలేదు. ఈమధ్య జరిగిన స్టీమరు కూలీలసమ్మెను చూచిన యీఉప్పుమాల్ కూలీలు చైతన్యమందారు. ఐక్యమయ్యారు. ఏకకంఠంతో సమ్మెను మొదలెట్టి, కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ఆఫీసుకు పరుగెత్తుకుంటూ వచ్చారు. చైతన్యాన్నిపొంది, సంఘటితమయి, ఏకముఖంతో సమ్మెను చేసివచ్చిన కార్మిక సోదరులకు, కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ఆహ్వానమిచ్చింది. వెంటనే సమ్మె సంఘం యేర్పరుపబడినది. వెంటనే ఫిబ్రవరి 20 వ తేదీ కార్మికుల కోర్కెలు సంఘముద్వారా పంపించబడ్డాయి.

కోర్కెలు.

1. (a) రోజుకు కూలీ 1కి 0-8-0 యివ్వాలి.

(b) ఉప్పుగుట్ట పోసినందుకు రాశి 1కి గ్యాంగుకు రు. 25 లు యివ్వాలి.

2. వేసవిలో ఉదయం 11 గంటలకే పని ఆపి మధ్యాహ్నం 2-30 లకే మొదలెట్టాలి.

3. భయపెట్టడం, తిట్టడం, కొట్టడం మానెయ్యాలి.

4. పనికి రమ్మనిపిలిచి, పని చూపించలేకపోతే కూలీకి సగం కూలీ యివ్వాలి.

5. కూలీల కండ్లకు జబ్బుచేసిన కంపెనీ వారే కండ్లకు చికిత్స చేయించాలి. పనిలో యే ప్రమాదము జరిగినా వర్కుమెన్సు కంపెన్సేషన్ యాక్టు ప్రకారం పరిహారాన్ని యివ్వాలి.

6. ఉప్పుమాల్ పాకీవానికి నెలకు రు 4-0-0 లు. చొప్పున జీతం యివ్వాలి.

7. ఉప్పుమాల్ కూలీ సంఘాన్ని గుర్తించాలి.

పై సుదహరించిన కూలీగాని, కంట్రాక్టుగాని ఇదివరకు యిచ్చినవే. అవే యిప్పుడు తగ్గించబడ్డాయి. యిదివరకిచ్చిన ప్రకారమే యిప్పుడూ యివ్వమని కూలీలు కోరారు. కాని కంపెనీవారు యివ్వమని గట్టిగా చెప్పారు. సమ్మె జయప్రదంగా సాగుతుంది. చాటుగా కూలీల్ని తీసుకురావాలని చేసే ప్రయత్నాలు విఫలమయ్యాయి. కంపెనీకి ఎంత నష్టం వచ్చినప్పటికీ తన గౌరవం కొరకని మెదలకుండా ఊరుకున్నాడు బ్రాంచి మేనేజరు. పై అధికారులకు కూడా తెలియబరిస్తే నష్టానికి తానే కారణమనుకుని వత్తిడి చేస్తారని వారికి తెలియచేయకుండా కూర్చున్నాడు.

ఈ సంగతి తెలియగానే కలకత్తాలోని పై అధికారులకీ విషయాన్ని సంఘం తెలియచేసింది. వెంటనే పైనుండి బ్రాంచిమేనేజరు రైనాల్డ్సుకు వత్తిడివచ్చింది. అప్పటికి 10 మంది మేస్త్రీలు మాత్రమే పనిచేస్తున్నారు ఉప్పుమాల్‌లో. వెంటనే దొంగకూలీలకొరకు ప్రయత్నాలు విరివిగాసాగాయి. కాని అన్నీ విఫలమయ్యాయి. మేస్త్రీలు మాత్రం పని జరుగుతుందన్నట్లుగా పనిచేయడం మొదలెట్టారు. ఉప్పు బాగా పండింది. ఆలాగేవదిలేస్తే పాడయిపోతుంది. ఉప్పునంతటినీ ప్రోగుచెయ్యడానికి కూలీలు లేరు. దాన్ని కప్పిపుచ్చడానికి, పండిన ఉప్పును కాపాడడానికి, మేస్త్రీలచేత రోజూ కొఠారులకు నీరుపెట్టించేవారు. తనమీద సాల్టుకమీషనరుగాని, పై అధికారులుగాని నెపం బెట్టకుండా తప్పుకోడానికని యిలా నీరుపెట్టించడం మొదలుపెట్టాడు. అయినప్పటికీ కూలీలు చలించలేదు. రోజూ దారిలో వస్తూపోతూ వుండే మేస్త్రీలందర్నీ కూలీలంతా సమ్మె చేయమని ప్రాధేయపడ్డారు. ఎంతో బ్రతిమాలారు. కాని వారికొచ్చే 10 రూపాయలజీతానికని, కూలీలప్రార్థనల్ని త్రోసిపుచ్చారు. వీరి ప్రార్థనల్ని పెడచెవినిబెట్టి పనిచేయడం ప్రారంభించారు. దొంగకూలీలుమాత్రం ఒకరూ వెళ్ళి పనిచేయలేదు. పని జరగడంలేదు. కార్మికులు చాల పట్టుదలతో నిలబడిపోయారు. ఈ 35 దినాల సమ్మెకు ఫలితంగా పండవలసిన 12 రాసుల ఉప్పు పండలేదన్నమాట. ఇంత ఉప్పువల్ల ప్రభుత్వానికి రావలసిన 20 వేల రూపాయల పన్ను సముద్రంలో కలిసినట్లే.

తిండిలేక మలమల మాడిపోతున్నప్పటికీ కూలీలు ధైర్యంగా నిలబడ్డారు. ప్రభుత్వానికి వచ్చే వేలకొలది రూపాయలు మట్టిలో కలిశాయి. దీన్నిగురించి కూలీల సంఘం ప్రధానమంత్రికి టెలిగ్రాములద్వారాను, ఉత్తరాలద్వారాను తెలియపరచింది. ఇంత నష్టాన్ని కాంగ్రెసు ప్రభుత్వం సహించకూడదు. ఒక్క కంపెనీ గర్వము నకై ప్రభుత్వం నష్టాన్ని భరించకూడదు. ఇక ప్రభుత్వం మాత్రం ఉపేక్షచేసినా ఉప్పుమాల్ నాశనమయి పనికిరాకుండా పోతుంది. ఇలాంటిసమయంలో ప్రభుత్వం కలుగచేసుకుంటే మంచిది. సమ్మెమాత్రం జయప్రదంగా సాగుతుంది. ఇకముందుకూడా ధైర్యంగా నిలబడతామని కార్మికులు చెప్తున్నారు.

## కాకినాడ సమ్మె చిత్రాలు



ఉప్పు కార్మికుల పూరేగింపు



పీడు పనిచేసే స్త్రీలు



పీడు కూలీల పూరేగింపు



ఉప్పు కూలీల పూరేగింపు

## త్రిపురీ కాంగ్రెసు

(18 వ పేజీ తరువాయి)

సంఘటిత శక్తిని" "ప్రపంచ పరిస్థితులలో తీవ్రగతిని కల్గు మార్పులు" గమనించి పోరాటానికి తయారు కమ్మని ప్రజా సామాన్యానికి కాంగ్రెసు సంఘాలకు, కాంగ్రెసు ప్రభుత్వాలకు, హెచ్చరిక జేస్తూ ఉంది.

అయితే ఈ రాజకీయాభివృద్ధి కనుగుణ్యముగా నిర్మాణాభివృద్ధి కలుగ లేదు. పంతు విశ్వాస తీర్మానము ద్వారా మితవాదనాయకులు, నాయకత్వములో పూర్వపుస్థితినే నెలకొల్పగలిగారు. కాని ఈ క్రొత్తస్థితి మునుపటి లాగనే ఉంటుం దనుకోకూడదు క్రొత్తగా రాబోవు వర్కింగుకమిటీ, ప్రా. వర్కింగుకమిటీ మాదిరి పనిచేయదు. ఇది ముందుకు సాగే కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టాలి. కనీసము ఆ కార్యక్రమాన్ని వ్యతిరేకించలేరు. కాంగ్రెసులో సామాన్య సభ్యులను నిర్లక్షించడమువల్లా, జాతీయోద్యమాన్ని ఎదుర్కొనుచున్న సమస్యలను గమనించనందున, నాయకత్వమప్పటికే కొన్ని దెబ్బలు తిని ఉంది. దాని ఫలితముగా కంట్లుకూడ తెరచింది. ప్రజా ఉద్యమము అతి త్వరితగతిని విజృంభిస్తూ ఉన్నకాలములో ఉద్యమానికి నాయకత్వము వహిస్తూ ఉంది. ఈ పరిస్థితులలో ముందుకు సాగుతూ ఉన్న ప్రజాసామాన్యముతో పాటు ఇదికూడ ముందుకు సాగాలి.

త్రిపురినుండి "దాడికి ఆజ్ఞ" ఇవ్వమని కోరాము. "తయారుగా ఉండ"మని కోరబడ్డాం. ఇప్పుడు బాధ్యత మనమీద ఉంది. మన సన్నాహాలు పూర్తిచేసుకొంటే, దాడికి ఆజ్ఞ త్వరలోనే ఇవ్వక తప్పదు.

అతివాదుల బలహీనతలన్నీ బయటపడ్డాయి. వారిలో ఐక్యత లేకపోవడము, వారిలో రాజకీయానుభవము ఇంకను పరిపక్వము గాకపోవడము స్పష్టముగా కనబడ్డాయి. అయినా నిరుత్సాహ పడవలసిన అవసరములేదు. మన ప్రధాన శత్రువు బ్రిటిషు సామ్రాజ్యముతో నిజమైన యుద్ధము ఆరంభమవుతూ ఉంది. అది సమీపిస్తూ ఉంది. ఈ సందర్భములో ప్రతి సోషలిస్టు గమనించవలసిన విషయము మరియొకటి ఉంది.

(త్రిపురి మరియొకమారు సోషలిస్టు ఐక్యత ఎంత అవసరమో స్పష్టపరచింది. కాంగ్రెసు తీర్మానాలలో గలిగిన మార్పుకు కారణము సోషలిస్టు కమ్యూనిస్టు ఐక్యతయే. పంతు తీర్మానాని కుపపాదించబడిన సవరణలకన్ని ఎక్కువ ఓట్లు సంపాదించడానికి కూడ ఈ సోషలిస్టు ఐక్యతయే కారణము. సోషలిస్టులు, కమ్యూనిస్టులు వేరువేరుగా ఓటు చేయడముతోనే మితవాదులు సులభముగా విజయాన్ని సంపాదించారు. ఈభేదాన్ని ఆధారముచేసుకొని నేడు సోషలిస్టు కమ్యూనిస్టులను చీలదీయడానికి, అప్రతిష్ట గావించడానికి ప్రయత్నాలు సాగుతున్నాయి. అంతేగాక సోషలిస్టులుకాని అతివాదులు సోషలిస్టుల నుండి దూరమై వేరే రాడికలు పార్టీని నెలకొల్పాలని కూడ ప్రయత్నాలు సాగుతున్నాయి. సోషలిస్టు కమ్యూనిస్టుల ఐక్యతయొక్క ఫలితాలు, వేరువేరు మార్గాలవలంబించినపుడు వచ్చే నష్టాలు చూచిన ప్రతివ్యక్తి సోషలిస్టు ఐక్యత అవసరమని గుర్తిస్తాడు. ఈఐక్యత లేనిదే కాంగ్రెసులోని డ్రిఫ్టును అపజాలరు. కాంగ్రెసు నంతటిని పోరాట మార్గాన ముందుకు తీసుకపోజాలరు. అందుచే సోషలిస్టు ఐక్యతకోసం మరింత తీవ్ర ప్రయత్నాలుచేసి, సంయుక్త సోషలిస్టు పార్టీ యొక్కటే దేశమందుండునట్లు చూడాలి.)

## సోషలిస్టు పార్టీ ఎందుకు తటస్థంగా ఉంది.

(14 వ పేజీ తరువాయి)

### లోపభూయిష్టమైన మానిర్మాణ విధానం.

వ్యవధి తక్కువగా ఉండడంవల్లను, త్రిపురీలో మా నిర్మాణ విధానంలోప భూయిష్టమవడంవల్లను (ఈ లోపమునకు బాధ్యత నామీదనే ఉంది.) మా డెలిగేట్లతో సంప్రదింపులు సాగించడం శక్యం కాక ఇందువల్ల పార్టీ సభ్యులలో కొంత గందరగోళానికి కారణం అయింది. బయటకూడా దురభిప్రాయాలు, అసంతృప్తి, వ్యాపించినట్లు తెలుస్తోంది. పత్రికలలో తప్పు వార్తలు ప్రకటించడం దీనికి కొంత వరకు కారణం. ఉదాహరణ: పార్టీ తరఫున నేనొక్కణ్ణే తీర్మానానికి సవరణ ప్రతిపాదించినట్లు చాలామంది అభిప్రాయ పడ్డారు. కాని, పార్టీ సభ్యులచేతను, సంయుక్తముగా ఒడంబడికవల్లను, ప్రతిపాదించబడిన సవరణలు మూడు. ఒకటి అచ్యుత పట్వర్ధన్, ఒకటి నేను, ఒకటి భరద్వాజ్, ప్రతిపాదించాం. త్వరలో యీ దురభిప్రాయాలను, తప్పుడు అర్థాలను, మనం తొలగించుకొనగలుగుదుమని నమ్ము తున్నాను. జాతీయోద్యమం యొక్క, సోషలిస్టు ఉద్యమంయొక్క, శ్రేయస్సును అభిలషించే ప్రతివారు సోషలిస్టు ఉద్యమాన్ని భగ్నంగావించే రీతిని యీ సమస్యను చర్చింపవద్దని ప్రార్థిస్తున్నాను.

### క్రొత్త ప్రతిబంధకాలేవీ ఏర్పడలేదు.

ఐక్యతకై మేము చేసిన త్యాగాల యెదుట ప్రతిఫలం చాలా స్వల్పము కాదా? అని కొందరు ప్రశ్నిస్తున్నారు. తటస్థంగా ఉండడమువల్ల మేము ఏ విధముగాను నష్టపోయామని నేను భావించను. తటస్థంగా ఉండడంవల్లనూ, తీర్మానంలో మేము అంగీకరించజాలని సిద్ధాంత భేదాలు ఉన్నందున అనుకూలంగా వోటుచేయం అని పార్టీ తరఫున నేను స్పష్టముగా తెలియజేసిన తరవాతను, ఆ తీర్మానంలో ఉన్న కొన్ని అభిప్రాయాలకు మేము ఏ విధంగాను బాధ్యులము కాము. అంతేకాక, తీర్మానం ప్యాసైన తరువాత కాంగ్రెసు వ్యవహారాలన్నీ పూర్వం మాదిరిగానే ఉంచబడ్డాయి. కొబట్టి ఆ తీర్మానం మన కార్యక్రమములో ఎట్టి ఆటంకమూ కలుగజేయడంలేదు. కాంగ్రెసు సంస్థ కొన్ని ముఖ్య విధాలపై ఆధారపడి నడుస్తోంది. వాటి హద్దులలోనే మనము కూడా నడుస్తున్నాం. ఆ విధానాలను మేము నేటివరకూ అంగీకరిస్తూనే వచ్చాం. కొబట్టి, వాటివల్ల క్రొత్త ప్రతిబంధకాలేవీ మనకు ఏర్పడలేదు.

### ప్రత్యక్ష ప్రయోజనాలు.

దీన్ని నేను ముగించక పూర్వం, అప్రయోజనమైన ఈ చర్చనుండి త్రిపురీ కాంగ్రెసు ద్వారా లభ్యమైన కొన్ని ప్రత్యక్ష ప్రయోజనాల వైపుకి ప్రజల దృష్టిని మరల్చ దలచుకొన్నాను. వచ్చే సంవత్సరంలో యీ ప్రయోజనాలే మన ప్రతిపనికీ దారి చూపుతాయి.

సోషలిస్టు ఉద్యమంయొక్క శ్రేయస్సు కోరే వారందరూ ఒక్క విషయం చూచి సంతోషించవచ్చు. కాంగ్రెసు సభ చివరివరకూ, సోషలిస్టులూ—కమ్యూనిస్టులూ, ఒక్క సందర్భంలో తప్ప, కలసి పని చేశారు. సోషలిస్టు ఐక్యతను వారుభయులూ కలసి ఆచరణలో పెట్ట గలిగారు. పంతు తీర్మానంమీద వోటింగు చేసే పద్ధతిపై భేదం ఏర్పడిన సందర్భంలో సహితం వారిరువురూ మొదట ఒడంబడిక చేసుకున్నారు. తరువాతనే భేదం ఏర్పడింది. కాని మా పార్టీకి—కమ్యూనిస్టులకు మధ్య జరిగిన ఒడంబడిక ప్రకారం, యీ భిన్న పంథాలను యెవరూ సోషలిస్టు ఉద్యమాన్ని భగ్నం గావించేటందుకు ఉపయోగించుకొనకూడదని నేను తెలియజేస్తున్నాను. ఈ భిన్న పంథాలను ఒక సాధనంగా వినియోగించుకొన ప్రయత్నిస్తూన్న వారంతా ఉద్యమానికి ఎట్టి సహాయంచేయక పోగా, గందరగోళపరచి భగ్నం గావిస్తున్నారని నేను తలుస్తున్నాను.

### గొప్ప అభివృద్ధి.

విశాలమైన జాతీయ దృష్టితో చూస్తే, త్రిపురీ కాంగ్రెసు గొప్ప అభివృద్ధిని తీసుకువచ్చిందని అంగీకరించాలి. లాహోరు కాంగ్రెసు మాదిరిగానే మన ఉద్యమానికి యిదొక మహోన్నత దశ. జాతీయ వాంఛకు సంబంధించిన తీర్మానంలో త్రిపురీ కాంగ్రెసు స్పష్టంగా ఒక అడుగు ముందుకు వేసింది. మొదటి విషయం: స్వయం నిర్ణయ సూత్రాన్ని ఇండియాకు వెంటనే వర్తింపజేయగల సమయం ఆసన్నమైనదని ఆ తీర్మానం స్పష్టంగా చెబుతోంది. రెండో విషయం: దేశాన్ని బలపరచడంలో రాష్ట్రీ స్వపరిపాలనకు గల శక్తి నేడు అతి త్వరితగతిని తగ్గిపోతూన్న యథార్థాన్ని పై తీర్మానం గుర్తించింది. అంటే, త్వరలోనే చట్ట సమ్మత కార్యక్రమంమీదనే దృష్టి అంతా కేంద్రీకరించు పంథా విడిచివేయవలసి వస్తుందని సూచించబడింది. ఆఖరి విషయం: "దేశం అంతటా" స్వాతంత్ర పోరాట సన్నాహాలు గావించవలసిందంటూ కాంగ్రెసు సంస్థలకూ, దేశానికీ పై తీర్మానం హెచ్చరిక చేసింది. "దేశం అంతటా" అనే శబ్దం ఎంత ముఖ్యమైనదో గుర్తించ గోరుతున్నాను. మన దృష్టి నంతటినీ యీ అంతిమ సన్నాహాలపై కేంద్రీకరించి, ఆచరణలో సాధించవలసియుంది. త్రిపురీ కాంగ్రెసు రణ దుందుభిని మ్రోగించింది. నిరర్థకమైన చర్చలు కట్టిపెట్టి, మనం రణరంగానికి ప్రయాణవుదాం.







## కాంగ్రెసు వార్తలు

### ఏ. ఐ. సి. సి. సమావేశము

త్రిపురీ కాంగ్రెసు సమావేశములో అధ్యక్షుడు గాంధీజీచెప్పిన వర్కింగుకమిటీనే,ఏర్పరచాలని తీర్మానము ప్యాసయింది. అధ్యక్షుడు ఇంతవరకు జబ్బుగా ఉండుటచే గాంధిజీని కలుసుకోలేకపోయాడు. వర్కింగుకమిటీని ఏర్పరచజాలకపోయాడు. దానిమీద కొంతమంది అఖిల భారత కాంగ్రెసు సంఘాన్ని సమావేశపరచుటకు నోటీసు పంపాలని ఆదుర్దాపడ్డారు. కాని అట్టినోటీసేమీలేకనే సుభాషుబోసే, కలకత్తాలో ఏ.ఐ.సి.సి. ఏప్రిల్‌లో సమావేశమవుతుందని ప్రకటించాడు. తేదీ గాంధీజీతో సంభాషించి ముందు తెలియజేస్తానన్నాడు.

### జిల్లా కాంగ్రెసుకమిటీ ఎన్నికలు.

మార్చిలో జరుగాలసిన ఎన్నికలు, అస్సెంబ్లీ సెషన్సు మూలంగా ఏప్రియల్ 6 వ తేదీ అన్ని జిల్లాలలో నూతన కార్యనిర్వాహకవర్గాలను ఎన్నుకోడానికి సమావేశమవుతాయి.

సమావేశ స్థలాలు.

| | |
|---|---|
| పశ్చిమ గోదావరి | తాడేపల్లిగూడెం |
| నెల్లూరు | నెల్లూరు |
| తూర్పు కృష్ణా | బందరు |
| తూర్పు గోదావరి | కాకినాడ |

* * *

## నాల్గవ అఖిలభారత రైతు మహాసభ

ఏప్రిల్ 9, 10 తేదీలలో గయలో (బీహార్) అఖిలభారత రైతు మహాసభ ఏకగ్రీవంగా ఎన్నుకోబడిన ఆచార్య నరేంద్రదేవ్ అధ్యక్షతను జరుగును. 7, 8 తేదీలు అఖిలభారత కిసాన్ కౌన్సిలు సబ్జెక్టుకమిటీ సమావేశము జరుగును.

అఖిలభారత రైతు సంఘ ప్రతినిధుల సమావేశం కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారి అధ్యక్షతను బెజవాడలో సమావేశమై ఈ దిగువవారిని అఖిలభారత రైతు సంఘ సభ్యులుగా ఎన్నుకొనిరి.

అఖిలభారత సభ్యులు

1. ప్రొఫెసర్ రంగాగారు
2. గోగినేని భారతీదేవిగారు
3. అల్లూరి సత్యనారాయణ
4. కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి
5. చ. వాసుదేవరావు
6. వాశిరెడ్డి శివలింగప్రసాద్
7. మలిరెడ్డి గురవారెడ్డి
8. చాగర్లమూడి వెంకట్రామయ్య
9. గౌతు లచ్చన్న
10. డి. యస్. వల్లభరావు

రాష్ట్రీ కార్యనిర్వాహక వర్గ ఎన్నికలు, సాధారణసంఘ సభ్యుల ఏకగ్రీవాంగీకారముపై ప్రస్తుతము నిలుపుదలచేసి మేనెలలో జరుపుటకు తీర్మానిస్తూ, అంతవరకు పాత కార్యనిర్వాహక వర్గమే సంఘ బాధ్యతనంతను నడుపుటకు అధికార మివ్వడమైనది.

### జిల్లా, తాలూకా రైతుసంఘ ఎన్నికల తేదీలు.

అన్ని జిల్లా, తాలూకా రైతుసంఘ ఎన్నికలను ఏప్రియల్ 20 వ తేదీలోగా ఆయా సంఘముల ఏర్పాట్లనుబట్టి, అభ్యర్థి దరఖాస్తులను తీసుకోవలెననియు, దరఖాస్తులను తీసుకొన్న పిమ్మట వారమురోజులు తక్కువలేనివ్యవధిలో ఏప్రియల్ 30 వ తేదీలోగా అన్నిచోట్ల ఎన్నికలు జరిపి సంఘాధికారులపేరులు చిరునామాలతోసహా రాష్ట్రీ సంఘమునకు మే 5 వ తేదీలోగా తెలియజేయవలెనని జిల్లాసంఘములను కోరుచున్నాము.

సాంవత్సరిక రిపోర్టులున్నూ, జమా ఖర్చుల నివేదకలను మే 5 వ తేదీలోగా రాష్ట్రీ సంఘమునకు పంపించవలెనని కోరుచున్నాను.

జిల్లాసంఘములు చెల్లించవలసిన సభ్యత్వరుసుం ఏప్రియల్ 10 తేదీలోగా చెల్లించుకొనుటకు అనుమతి నొసంగుచూ ఆతేదీకి చెల్లించని జిల్లాసంఘములపై తగు చర్య గైకొనుటకుగాను కార్యవర్గమునకు అధికార మివ్వడమైనది.

కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి.

* * *

## తూ॥ గో॥ జి॥ కాంగ్రెసు సోషలిస్టు పార్టీ

### సాంవత్సరిక సమావేశము.

ఈ నెల 30, 31 తేదీలలో తుని తాలూకా తొండంగిలో జరుగును.

30-3-39 తేదీ లక్ష్మీవారం ఉదయము 8 గంటలకు పై సమావేశము తుని తాలూకా తొండంగిలో జరుగును.

29-3-39 తేదీ బుధవారం ఉదయం 8 గం॥ లకు పైపార్టీ కార్య సంఘ సమావేశము పై స్థలములోనే జరుగును.

సమావేశములో చర్చింపబడు విషయములు.

1. పార్టీ సాంవత్సరిక నివేదిక
2. త్రిపురి కాంగ్రెసు తీర్మానములు
3. పార్టీ నిర్మాణ సమస్యలు
4. జిల్లాలలో వాలంటీరు దళముల నేర్పరచుటను గురించి
5. ఇతర విషయములు

రాజమండ్రి, 20-3-39. } పి. అనంతం, కార్యదర్శి.

* * *

### చంద్రగిరి సబ్ కలక్టర్ దగ్గరికి వెదళ్ళచెరువు కూలీల యాత్ర.

సమ్మె నెల రోజులనుంచీ సాగుతున్నది. రేణిగుంట సబ్‌యినస్పెక్టరు చేసిన రాజీ న్యాయమయినది కాకపోయినా కూలీలు సమ్మతించారు. రైతులు ప్రతిఘటించారు. దానికేమి చర్య తీసుకొనట్లు తెలియగా 7 తారీఖు కూలీలందరు నడచి చంద్రగిరి సబ్‌కలక్టరు కోర్టుకు హాజరయ్యారు. వాళ్లకు నాయకత్వం వహించి నడుపుతున్న పి. చంగయ్య, వై. కృష్ణయ్య, రత్నం, ఇమాం సాహెబ్‌గార్లు కూడా వెళ్లి వాళ్ళ కష్టాలు అర్జీ మూలంగా యివ్వటానికి తోడ్పడిరి. కలక్టరుగారు ప్రత్యేకంగా విచారిస్తారని అనుకొన్నాం. కాని అలా జరగలేదు. అర్జీ తీసుకొని "విచారణ చేస్తాను వెళ్ళండి" అని అన్నారు. కాని యింత వరకు యేమీ జరుగలేదు. రైతులు పరిసర గ్రామాల రైతుల సహాయంవల్ల కూలీలను రప్పించి పని చేయించుకొంటున్నారు. మాన్యంకు సంబంధించిన భావి విషయంలో సివిల్ కేసు చేసినట్లు తెలుస్తుంది.

కూలీలేమో తిండిలేక తంటాలు పడుతున్నారు. యెంత కాలం సమ్మె సాగాలో లేక పని చేయాలో? తెలియలేదు.

* * *

### ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్‌చే నడుపబడు ఆర్థికరాజకీయవేసంగిపాఠశాల ఇచ్ఛాపురం

స్వాతంత్ర పోరాటములో పాల్గొనుటకు జాతీయ అంతర్జాతీయ సమస్యలను బాగుగా బోధచేసుకుని దేశములోని ప్రజాసామాన్యము మధ్య పనిజేయుటకును విద్యావంతులు ఐన యువజనులు వేనకువేలు తయారు కావలసిన ఆవశ్యకత చాలాయున్నది. కేవలము మానసికాభివద్ధియేగాక దానితోబాటు శారీరకముగాకూడ శిక్షణపొందుట చాలా అవసరము. ఇట్టి వారలను తయారుచేయుట కొరకే ఈ వేసంగి మేనెలలో ఆర్థిక రాజకీయపాఠశాల నొకటి ఆంధ్ర రాష్ట్రీ విద్యార్థి ఫెడరేషన్‌వారి యాజమాన్యమున, విశాఖపట్నం జిల్లాలోని యిచ్ఛాపురంలో స్థాపింపబడబోవుచున్నది.

ఇచ్ఛాపురం ఉత్తర విశాఖజిల్లాలో మద్రాసు కలకత్తా రైలుమీదవుంది. ఇక్కడికి సముద్రం 4 మైళ్ళ దూరం. మెయిల్ ఆగేస్థలం. సమశీతోష్ణం విద్యార్థులకు చక్కని వసతిగృహాలు ఏర్పాటు చేయబడివుంది. స్త్రీలకు ప్రత్యేకబసలు కుటుంబాలతో వుండేవారికికూడా ప్రత్యేకబసలు చుట్టుపట్ల గ్రామాల్లో ప్రచారం చేయడానికిబస్సు గూడా ఏర్పాటు చేయబడును ముఖ్యమగు దిన పత్రికలు, వారపత్రికలు విద్యార్థుల కీయబడును. స్కూలుకు చక్కని గ్రంధాలయముంది. బొంబాయి కలకత్తా యితరప్రాంతాలనుండి సుప్రసిద్ధ జాతీయనాయకులు ఉపన్యాసకులుగా పిలువబడ్డారు.

అఖిలభారత కిసాన్ సంఘాధ్యక్షులు, దేశభక్తులు సహజానంద సరస్వతిగారు ప్రారంభోత్సవము చేయటానికి దయతో అంగీకరించారు. ఈక్రింది ప్రధాన విషయాల్లో శిక్షణ యివ్వబడును. వివిధ రాజకీయ సిద్ధాంతాలు, రాజ్యాంగ నిర్మాణాలు, స్వాతంత్ర్య పోరాటము యొక్క చరిత్రలు, మిలిటరీ డ్రిల్లు, మిలిటరీ బ్యాండు, ఉపన్యాసములిచ్చుట,చర్చలుచేయుట, వ్యాసరచన, వక్తృత్వము, కార్మిక కర్షక సమస్యలు.

విద్యార్థులుగా రాబోవువారును, ఇతర వివరములు తెలిసికొన గోరేవారును, ఈక్రింది చిరునామాకువ్రాసి తెలిసికోవలెను. ఏప్రిలు 15 వ తేదీ తర్వాత దరఖాస్తులు తీసికోబడవు.

N. B:—తగిన విద్యార్థులకు (స్వాతంత్ర్య పోరాటములో బాగుగా కష్టము అనుభవించిన వారికి, ఇంకా యితరులకు) జీతములో కన్సెషన్ యివ్వబడును.

జి. రామకోటేశ్వర్రావు, సెక్రటరీ (ఆ. రా. వి. ఫె.) ఆర్గనైజరు.

వివరములకు,

బి. సూర్యనారాయణ
C/% లక్కరాజు వెంకట్రావు
కొత్తపేట, విజయనగరం.



### కృష్ణా జిల్లా రైతు సంఘం ఎన్నికలు

నూతన తాలూకా కార్య సంఘముల ఎన్నికలు 1-4-39 తేదీ మధ్యాహ్నం గం॥ 2 కు ఆయా తాలూకా సంఘ కార్యాలయంలో జరుపబడును. బెజవాడ తాలూకా సంఘం ఎన్నికలు బెజవాడలో జిల్లా రైతు సంఘ ఆఫీసులోను, కైకలూరుతాలూకా సంఘఎన్నిక కైకలూరులో రహదారి బంగళాలోను జరుపబడును.

నూతన జిల్లా కార్యసంఘ ఎన్నిక 7-4-39 తేదీ సాయంత్రం 4 గంటలకు దివి తాలూకా కొజ గ్రామములో జరుపబడును. నూతనముగా ఎన్నుకోబడిన సభ్యులందరును, ఈ ప్రకటననే సమావేశపు ఆహ్వానముగా భావించవలెను కొజలోనే 8, 9 తేదీలలో చతుర్థ కృష్ణా జిల్లా రైతు మహాసభ జరుపబడును.

కామినేని వెంకటప్పయ్య,
ఎన్నికోద్యోగి.

* * *

## బహిష్కరించాలి.

కాశీపట్నం కేసులు ఉపసంహరించుకోవలెననీ ఖైదీలను విడుదలచేయవలెననీ మద్రాసు ప్రభుత్వము ఉత్తరము పంపినట్లు తెలియుచున్నది జిల్లాకలెక్టరును విచారించి రిపోర్టుపంపమని ప్రభుత్వం కోరుటచే, కలెక్టరు కాశీపట్టణ గ్రామస్థులను తమ తరపున వాదించుటకు తమలో నుండి ఒకరిని యెన్నుకొని వారంలోపల తెలియపర్చాలని రైతులకు నోటీసు చేసాడు.

ఈ తగాదాలో జిల్లాకలెక్టరు మొదటినుండీ జమీందారుపక్షం వహించి పనిచేయుట, రాష్ట్రీ ప్రభుత్వ అనుమతిలేకుండానే 144 వ సెక్షను పెట్టుట, రిజర్వుపోలీసును పంపుట, అమానుషమైన లాఠీచార్జీలను సమర్థించుట జరిగింది. అట్టి జిల్లాకలెక్టరు విచారించి పంపిన రిపోర్టు న్యాయం కలుగ చేయజాలదు. అందుచే రైతులు యీ విచారణకమిటీని పూర్తిగా బహిష్కరించాలి.

Published by M. Chandrasekhara Rao } at Navasakti Press, Governorpet, Bezwada.
Printed by Tummala Venkata Ramiah }

